# ఈ పుస్తకం కొనే ముందు.....

గత 90 సం॥లుగా సాహిత్యసేవ చేస్తూ, ఉత్తమ విలువలున్న ప్రామాణిక గ్రంథాలను మాత్రమే ముద్రిస్తున్న మా సంస్థపట్ల అఖిలాంధ్ర పాఠకోత్తములు కనబరుస్తున్న ఆదరాభిమానములకు ముందుగా మా కృతజ్ఞతాభివందనాలు.

ఇక

ఈ విశిష్ట గ్రంథాన్ని గూర్చి.....

ఇప్పుడు మీ చేతుల్లో ఉన్నది అసలు ప్రామాణిక గ్రంథం!

"**సిద్ధనాగార్జున తంత్రం**" పేరిట ఇంతవరకు తెలుగులో ఉత్తమ ప్రామాణికగ్రంథం లేదు. ప్రస్తుతం ఈ పేరుతో లభ్యమవుతూన్న కొన్ని ప్రచురణలు, ఎన్నో ఇతర తంత్రగ్రంథాల "**కలగూరగంప**"ను తలపించేవిగా ఉన్నాయి. సంస్కృతమూలంతో సరిపోలుట లేదు.

ఈ ముఖ్యవిషయాన్ని గ్రహించిన మేము, వారణాసి నుంచి 1962 నాటి ప్రాచీన ప్రతిని తెప్పించి మూలము సంశోధించి (వివరములు లోపల ఇవ్వబడినవి) ఉత్తమ ప్రామాణిక గ్రంథంగా అసలైన సిద్ధ నాగార్జున తంత్రం మీకు అందజేస్తున్నాం!

ఈ ప్రామాణిక గ్రంథానికి మాత్రమే మీ అపూర్వాదరణ లభించ గలదని మేము ఆకాంక్షిస్తున్నాం.

నకిలీలు, నకలు ప్రతులు కొని మోసపోవద్దు!

**కేవలం**

**గొల్లపూడి వారి ప్రచురణలే ప్రామాణికాలని మరువద్దు!!**

సదా మీసేవలో - మాకిది **90వ** సారస్వత సంవత్సరం.



ఖాళీ

# సిద్ధనాగార్జున తంత్రము

(శ్రీ సిద్ధనాగార్జున కక్షపుటము)

ప్రామాణిక తంత్ర గ్రంధము

తెలుగుభాషలో ఏకైక
చతుష్షష్టి (64) తంత్ర అనువాదకులు
బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్
విద్యాప్రవీణ, M.A. సంస్కృతం.,

ప్రచురణ కర్తలు
ఫోన్ : 0883-2465253
గొల్లపూడి వీరాస్వామి సన్
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.

 2010 వెల : 100-00



## సిద్ధ నాగార్జున తంత్రము

ప్రథమముద్రణ : 2010

త్రిస్కంధ పండితులు
సాహిత్య విద్యాప్రవీణ- తర్క-వేదాంతధురీణ
బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్, M.A.,సంస్కృతమ్
అహమ్మదాబాద్ (గుజరాత్)
మొబైల్ : 099983-44758
ఈ మెయిల్ Sampath2016@ yahoocom.

మీ సందేహాలకు
మరియు సలహాలకు
రచయితనే
సంప్రదించగలరు.

ముఖచిత్రాలు :
కె.బి. క్రియేషన్స్
రాజమండ్రి - 533 103.

గ్రంథ ముద్రణ :
మహేశ్వరీ ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్
రాజమండ్రి - 533 104.

ముఖచిత్ర ముద్రణ :
ఈశ్వర్ గ్రాఫిక్స్
రాజమండ్రి - 533 103.

ప్రకాశకులు :
గొల్లపూడి వీరాస్వామి సన్
కోటగుమ్మం - రాజమండ్రి. - 533 101.



"యక్షిణి" (ఎల్లోరాగుహ)



# సిద్ధనాగార్జున తంత్రం-వివరణ

గతంలో **"నాగార్జునతంత్రం"** అను పేరుతో, తెలంగాణా - తదితర ప్రాంతములనుండి కొన్ని పుస్తకములు వచ్చినవి. కానీ వాటియందు మూలపాఠమూ లేదు, ఒక క్రమమూలేదు, అంతేగాక అవి ఇతర తంత్రవిషయములు ప్రక్షిప్తం చేయబడి, కేవలం నాగార్జునిని పేర ప్రచురించబడినవి. వాటికి ప్రామాణికత లేదు.

ప్రస్తుతం ఈ గ్రంథము 30 పటలములలో నున్న ప్రాచీన గ్రంథము **1962**లో స్వామి కౌశలానంద, కౌళాచార్య వద్ద నున్న ఒక ప్రాచీన వ్రాతప్రతి యొక్క ప్రతిలిపి ఆధారముగా చౌఖంబా - వారణాసి వారు ముద్రించారు. మూలము దానిని మేము గ్రహించాము.

అసలు నాగార్జునుని గూర్చి అనేక చారిత్రక విషయములు, అనేక గ్రంథములు, పరిశీలించి ప్రామాణికమైన ఒక పీఠిక రచించినాము.

ఇది ప్రామాణికమైన **"సిద్ధనాగార్జున తంత్రం"** అనుటలో సందేహ మేమీలేదు. పూనాలోని రెండు కక్షపుటీ ప్రతులు ఇంకనూ పరిశీలించ లేదు. అవి సంపాదించి సంస్కరించిన పిమ్మట, ఈ గ్రంథములోని మూలపాఠమునకు చివరి ప్రకరణము లేదా చివరిపటలమునకు భిన్నముగా నున్నచో, వాటిని దీనికి చేర్చి మరల పరవర్ధిత సంస్కరణ ముగా ముద్రించగలము.

అంతవరకూ దీని ప్రామాణికను శంకించు అవసరములేదు. ఎవరివద్దనైననూ సిద్ధనాగార్జునతంత్ర వ్రాతప్రతి గాని యున్నచో, దానిని తులనాత్మకాధ్యయనము చేసి స్వీకరించగలము.

మేడవరపు సంపత్ కుమార్

## పీఠిక

"సిద్ధనాగార్జున - కక్షపుటం" వ్రాసిన నాగార్జునుని గూర్చి అనేక మత భేదములున్నవి. బౌద్ధతత్త్వవేత్త ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. **145** కాలమువాడు. ఇతడు మాధ్యమకవాదం ఉద్బోధించాడు. ఇతడు ఆంధ్రుడు, శాతవాహనుల కాలంలో కృష్ణానదీ తీరాన సిరి పర్వతం (శ్రీ పర్వతం)పై నివసించి సాధనలు చేసిన బౌద్ధుడు.

మరొక నాగార్జునుడు సిద్ధనాగార్జునుడు. ఇతడు క్రీ.శ **645** కాలములోనివాడు. తాంత్రిక సాధనలుచేసి అనేక గ్రంధములు వ్రాసి, రసవాదములో సిద్ధిపొందినవాడు.

ప్రస్తుత గ్రంధము "సిద్ధనాగార్జున కక్షపుటం" అనబడే సిద్ధ నాగార్జున తంత్రం. ఇది **30** పటలములలో ఉన్నది. ప్రారంభ మంగళాచరణ శ్లోకములో "శివునికి, తరువాత శ్లోకములో కులకేళి శోభితమైన, వాగ్దేవి అయిన సరస్వతికి వందనమాచరించాడు. కనుక ఇతడు బౌద్ధ నాగార్జునుడు కాడు.

ఇందు ప్రథమ పటలములో గ్రంథములో చెప్పబడిన విషయ ములను ప్రస్తావించుచూ, చివరిగా **కక్షపుటీసిద్ధి** అనే ప్రకరణం కూడా ఉల్లేఖించాడు, కాని అది లభించలేదు. ప్రస్తుత నాగార్జున తంత్రం **1962లో**, స్వామి కౌశలానంద కౌళాచర్య వద్దనున్న వ్రాతప్రతి నుంచి ప్రతిలిపి చేసినది, దీనిని చౌఖంబా, వారణాసివారు ప్రచురించారు.



నేపాల్‌లోని దర్బార్ లైబ్రరీలో నాగార్జున తంత్రం, కక్షపుటీ సహితంగా ఉన్నట్లు తెలియుచున్నది. మన భారత దేశంలో పూనాలో, ఆనందాశ్రమంలోనూ, భండార్కర్ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ లోనూ "కక్షపుటం" వ్రాతపతులు ఈ నెంబర్లలో ఉన్నాయి. వాటిని పరిశీలించలేదు.

ఆనందాశ్రమంలో "కక్షపుటం" ప్రతులు రెండు ఉన్నాయి. **1 - కక్షపుటః - 5 2- (13 - 9 - 227).**

### భండార్కర్ ఇన్‌స్టిట్యూట్‌లో ఏడు ప్రతులున్నవి

| | | | | |
|---|---|---|---|---|
| **1** - కక్షపుటః | - | **345** | - | **448** నెంబరు |
| **2** - కక్షపుటః | - | **345** | - | **472** నెంబరు |
| **3** - కక్షపుటః | - | **345** | - | **23** నెంబరు |
| **4** - కక్షపుటః | - | **345** | - | **764** నెంబరు |
| **5** - కక్షపుటః | - | **345** | - | **1111** నెంబరు |
| **6** - కక్షపుటః | - | **345** | - | **447** నెంబరు |
| **7** - కక్షపుటః | - | **1264** | - | **437/1875 - 76** |

ఇవన్నీ దేవనాగరి లిపిలో ఉన్నాయి. మరే ఇతర గ్రంధాలయములోనూ కక్షపుటి లభించుటలేదు. డక్కన్ కాలేజీ, పూనాలోని గ్రంధాలయములో **327** శ్లోకములతో "కక్షపుటీవిద్య" అను ప్రతి వున్నది, కాని అది నిత్యనాథ విరచితమని యున్నది. దానిని కూడా ఇంకా పురిశీలించలేదు.

ఆనందాశ్రమం పూనాలోనే నాగార్జున విరచిత "యోగరత్న మాల" అను గ్రంథము 55-(13-11-270) నెంబరులో ఉన్నది. ప్రస్తుత సిద్ధనాగార్జున తంత్రగ్రంథములో శాంభవతంత్రం - యామళం - డామర్ తంత్రం - ఉడ్డీశ - మేరుతంత్రం" మొదలగు 32 గ్రంథములనుండి విషయము సేకరించినట్లు చెప్పబడినది.

అందుచేత ఇది నాగార్జునడనే సిద్ధుడు సంకలనము చేసినట్లు భావించవచ్చు. ఇందలి విషయము మాత్రము బౌద్ధుల అష్టసిద్ధుల ననుసరించి వ్రాయబడినది. సాధనామంత్రములు మాత్రము బౌద్ధమంత్రములు కావు.

యోగ - తంత్ర శాస్త్రములందు అణిమ - మహిమా మొదలగు ఎనిమిది సిద్ధులు అష్టసిద్ధులుగా చెప్పబడినవి. బౌద్ధ తంత్ర శాస్త్రరీత్యా అష్టసిద్ధులు ఇట్లుండును. 1. ఖడ్గసాధన 2. అంజన 3. పాదలేప 4. అంతర్ధాన 5. రసరసాయన 6. ఖేచర 7. భూచర 8. పాతాళ సాధనలు.

"బ్రహ్మవైవర్త పురాణం"లో 34 సిద్ధులు చెప్పబడినవి. టిబెట్ తంత్రశాస్త్ర వ్రాతప్రతుల గ్రంధపట్టిక, "టిబెటన్ తాంగ్యూర్"లో బౌద్ధ నాగార్జున విరచిత గ్రంథములు 58 పేర్కొనబడినవి. వాటి పట్టిక ఇట్లున్నది. **అందు కక్షపుటం పేర్కొనబడినది.**

## టిబెట్‌లోని నాగార్జునుని రచనలు (వ్రాతప్రతులు)

1. మంత్రాలంకార సాధన
2. కక్షపుటం
3. పిండీకృత సాధన
4. శ్రీగుహ్యసమాజ మండలవిధి



5. సేకచతుర ప్రకరణం
6. బోధిచిత్త వివరణ
7. పంచక్రమం
8. ఆర్యనీలాంబరధర వజ్రపాణి సర్వమండల నిష్పన్నవిధి
9. స్వభావసిధ్యుపదేశం
10. వజ్రయాన స్థూలపట్టి
11. ప్రజ్ఞా పారమిత హృదయసాధన
12. ఆర్య.నీ. వజ్రరాణి కల్పధారిణీటీక
13. లోకేశ్వర సాధన
14. నీలాంబరోపసిద్ధి
15. వజ్రపాణి మండలవిధి
16. హయగ్రీవ సాధన
17. ధర్మధాతు స్తోత్రం
18. నిరుపమ స్తవం
19. లోకాతీత స్తవం
20. చిత్త వజ్రస్తవం
21. పరమార్ధ స్తవం
22. కాలత్రయ స్తోత్రం
23. సత్వారాధన స్తవం
24. ప్రజ్ఞా పారమిత స్తోత్రం
25. అచింత్యస్తవం
26. స్తుత్యాతీత స్తవం
27. నిరుత్తర స్తవం
28. మంజుశ్రీ పరమార్థస్తుతి
29. మంజుశ్రీ కరుణా స్తోత్రం
30. ద్వాదశకారణ్య స్తోత్రం
31. వందనా స్తోత్రం
32. అష్టమహా స్థాన చైతన్య స్తోత్రం
33. సకలోద్ధారం
34. సమాధి భాషాటీక
35. మహాకారుణిక తారాసాధన
36. సప్రజ్ఞా శ్రీమహాకాల సాధన
37. శ్రీమహాకాళ సోత్రం అష్టమంత్ర
38. శ్రీమహాకాళ స్తోత్ర పద్మాష్టకం
39. సహస్రభుజ అవలోకితేశ్వర సాధన
40. లోకేశ్వర షడక్షర సాధన
41. సప్తాంగ సాధన
42. వజ్ర మహాకాళాష్టక స్తోత్రం
43. సమాధిభాషా టీక
44. గుహ్యసమాజ టీక

| | |
|---|---|
| **45.** గుహ్యసమాజ క్రమసాధన సూత్ర మేలాపకం | **52.** తత్వప్రదీప |
| | **53.** ప్రతిష్ఠాపనాలంకార |
| **46.** కల్యాణ కామధేను | **54.** మహాకాళసోత్ర భావనా సంచారం |
| **47.** తారాసాధన | |
| **48.** తారాసాధనా సంక్షేపం | **55.** ప్రాయశ్చిత్తామృతం |
| **49.** శ్రీమహాకాల సాధన | **56.** అష్టాదశపటల విస్తారవ్యాఖ్య |
| **50.** క్రోధవజ్రదేవ మండలవిధి | **57.** వజ్రపవిత్ర కర్మసంభారం |
| **51.** వజ్రపాణి మార్గాష్టకం | **58.** మంజుశ్రీ ప్రజ్ఞా వర్ధన |

## తంత్రశాస్త్రం బౌద్ధతంత్రంతోనే ప్రారంభం

వేదకాలంలో వైదిక యజ్ఞాలు, మంత్రసాధనలు, తపస్సు ఇవన్నీ "ఋగ్విధానం" – "అధర్వవేదం"లో చాలా విస్తృతంగా యున్నాయి. కాని అవన్నీ యజ్ఞోపవీతం ఉన్న అగ్రవర్ణాలవారికే అధికారంగా యుండేది.

జనసామాన్యంలో పామరులు, అన్ని వర్ణాలవారూ ఆచరించ డానికి – తంత్రసాధనలూ చేయడానికి బౌద్ధతంత్రశాస్త్రం వీలు కల్పించింది. బౌద్ధంలో క్రీ॥పూ వైపుల్యసూత్రంలో మంత్రయానం అందరికీ వర్ణవివక్షత లేకుండా అందుబాటులోకి వచ్చింది. ఇది సంగీతీశైలిలో వ్రాయబడింది.

ఆ తరువాత అమితాయుసూత్రం (సుఖావతీవ్యూహం) గ్రంథాలు క్రీ॥శ **100**లో సంస్కృత లేదా పాళీభాషలో లభించేవి. వీటిని క్రీ॥శ **148 – 170** మధ్య కాలంలో చైనీ భాషలో అనువదించారు. దీని



తరువాత సుమారు వంద సంవత్సరాలకు "మంజుశ్రీ మూలకల్పం॥ రచించబడింది.

అక్కడనుంచి సుమారు **400** సంవత్సరాలు అతి రహస్యంగా మంత్ర – తంత్ర సాధనలు గురుపరంపరలో బౌద్ధులలో, మఠాలలో జరుగుతూ ఉండేవి. క్రీ॥శ॥ **280 – 360**లో జీవించిన, అసంగుడు బౌద్ధ తంత్రశాస్త్రమును బహిరంగ పరచి కొంత ప్రచారానికి ఊతమిచ్చాడు.

కానీ అప్పటికే కొంత గ్రంథ రచన జరిగినా చాలా రహస్యంగా ఉండేది. ఆనాటికే గుహ్యసమాజ తంత్రం – శ్రీచక్రసంవత తంత్రం – హేవజ్రతంత్రం ప్రామాణిక బౌద్ధగ్రంథాలుగా పేరు పొందాయి. అందులో మహాముద్రా సాధన, స్త్రీతో కలసి పురుషుడు సాగించే పంచమకార సాధన ఉన్నది.

అప్పటికి క్రీ॥శ **500** నాటికి భారతదేశంలో నాలుగు పీఠాలు ఏర్పడ్డాయి. మొదటిది ఉడ్డీయాన పీఠం. **2.** సిరిహట్ట (ఇది అస్సాం దగ్గరి "సివిహుట్" అని చరిత్రకారులు చెబుతున్నారు. కాని, నా ఉద్దేశ్యం పరిశోధన ప్రకారం ఇది శ్రీపర్వతం, పాళీభాషలో శ్రీ అనునది సిరి, పర్వత పదమునకు పబ్బత, హట్ట అని అవుతాయి. శ్రీపర్వతమే సిరిహట్ట, ఇది నేటి శ్రీశైలం కాదు. కృష్ణానదీ తీరాన ఉన్న నాగార్జున కొండ అనబడేదే. దీనినే భ్రమరగిరి అని వ్యవ హరించారు. కొందరు భ్రమరగిరి అంటే భ్రమరాంబాదేవి వెలసిన శ్రీశైలం అని భావిస్తున్నారు. అది సరికాదు.

సిరిహట్టము బౌద్ధక్షేత్రము, శ్రీశైలం శక్తిక్షేత్రము ఈ రెండూ నల్లమల పర్వతముల శ్రేణిలోనే ఉన్నవి. నల్లగా తుమ్మెద రెక్కలవలె శోభించుటచే కవితాత్మకంగా భ్రమరగిరి అన్నారు. భ్రమరాంబ వలన శ్రీశైలమూ భ్రమరగిరిగా చెప్పారు.

"గండవ్యూహం" అను మహాయాన గ్రంధములో ధాన్యకటకము (అమరావతి) దగ్గర గల అడవి ప్రాంతంలో మహానాగులు అనే ఆటవిక జాతివారు నివసించేవారు. వారు బౌద్ధులుగా మారారు. ప్రాచీనాంధ్ర దేశంలో నాగజాతివారు ఎంతో ప్రముఖులు. నాగుల ఆరాధన అనాదిగా తెలుగుదేశంలో వ్యాపించియున్నవి.

శాతవాహనుని మిత్రుడుగా నాగార్జునాచార్యుడు ఎంతో నాడు ప్రసిద్ధుడు. "సుహృల్లేఖ" అనే ఉత్తరంలో స్నేహితునికి హితబోధగా **123** శ్లోకాలు వ్రాసి పంపాడు.

**1938**లో, నాగార్జున కొండవద్ద జరిపిన ప్రాచీన పురావస్తు శాఖవారు జరిపిన త్రవ్వకములలో, ఒక పెద్ద మట్టి పాత్రలో కొన్ని అవశేషములు, దంతములు లభించాయి. అవి నాగార్జునాచార్యుని భౌతిక అవశేషములుగా పురాతత్వ శాస్త్రవేత్తలు నిర్ధారించారు. దాని పోటో ముందు పుటలలో ప్రచురించబడినది.

కనుకనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము **1976** ఆగష్ట్ **19**న, ఆచార్య నాగార్జునిని దివ్యస్మృతికి నాగార్జున యూనివర్సిటీ స్థాపించి అందు "మహాయాన బౌద్ధ అధ్యయన కేంద్రం" ప్రారంభించారు. ఈ విశ్వ విద్యాలయమునకు దేశ విదేశాలనుంచి బౌద్ధులు, వస్తూ ఉంటారు.



ముఖ్యంగా టిబెట్ – జపాన్ – శ్రీలంక – చైనా మొదలగు దేశాల నుంచి వస్తారు. **2006**సంవత్సరంలో టిబెట్ మతగురువు **14**వ దలైలామా ప్రపంచశాంతికి "కాలచక్రం" అనే బౌద్ధ తంత్ర మండల పూజ ఆచరించారు. అంతర్జాతీయ స్థాయిలో ఇచట బౌద్ధ సమావేశములు జరుగుతూ ఉంటాయి.

ఆచార్యనాగార్జుని తత్త్వ గ్రంధముల రచనలో అతి ముఖ్యమైనవి "మాధ్యమక కారికలు" దీనికి చంద్రకీర్తి "ప్రసన్నపద" అనే చక్కని సంస్కృత వ్యాఖ్యానం రచించాడు, అలాగే భవసంక్రాంత సూత్రవృత్తి –విగ్రహవ్యావర్తని–శతసాహస్రిక–చతుఃస్తవము–రత్నావళి మొదలగునవి.

నాగార్జునాచార్యుని ముఖ్యశిష్యుడు "ఆర్యదేవుడు" ఇతడు చతుఃశతకం – శతశాస్త్రం అనే గ్రంధాలు రచించాడు. ఇవి సంస్కృత భాషలోనికి మరల అనువదించబడి లభించుచున్నవి. బౌద్ధ నాగార్జునుని గురువు అశ్వఘోషుడు.

క్రీ॥శ **645** నాగార్జునుని గురువు, రాహుల భద్రుడు ఇతడి మరోపేరు సరాహా. ఈ గురుపరంపర "శ్రీచక్ర సంవరణ తంత్రం"లో ఇలా పేర్కొనబడింది.

1. సరాహా –క్రీ॥శ **633**–"బుద్ధ కపాలతంత్రం" రచించాడు.
2. నాగార్జునుడు – క్రీ॥శ **645** –
3. సావరిప
4. లుయిపా –"యోగినీసంచర్య" అనే తంత్ర శాస్త్రం రచించాడు

**5.** వజ్రఘుంట

**6.** కచ్ఛప

**7.** జాలంధరి

**8.** కృష్ణాచార్య –"సంపుటతిలకం॥ రచించాడు.

**9.** గుహ్యా

**10.** విజయపా

**11.** తిలోపా

**12.** నరోపా

ప్రాచీన చతుష్పీఠాలు ఇవి. **1.** ఉడ్డీయానం **2.** సిరిహట్టం **3.** కామాఖ్య **4.** పూర్ణగిరి.

ఈ వివరాలు "సాధనమాల" అనే బౌద్ధ తంత్ర గ్రంథంలో ఉన్నాయి. ఇందు **312** సాధనలు చెప్పబడ్డాయి.

బౌద్ధ తాత్వికుడు నాగార్జునుడు, తాంత్రిక నాగార్జునుడు వేరు వేరని "ది లైఫ్ ఆఫ్ నాగార్జున ఫ్రమ్ టిబెటన్ అండ్ చైనీస్ సోర్సెస్" అను గ్రంథంలో యమ్.వల్లేసర్ చాలా చక్కగా సప్రమాణంగా నిరూపించారు.

వీరిరువురే గాక కాశ్మీరుని పాలించిన నాగార్జునుడు, బోధిసత్వ నాగార్జునుడు కూడా ఉన్నారు. **84** మంది సిద్ధులలో ఒక సిద్ధుడుగా నాగార్జునుడు పరిగణింపబడినవారు శ్రీ పర్వత సిద్ధుడై ఉండవచ్చు. ఇతడే రసవాద విద్యయందు సిద్ధుడని కొందరు చెప్పుచున్నారు.



## బుద్ధుడు తంత్ర వ్యతిరేకి

అసలు బౌద్ధమతంలోకి బుద్ధుని నిర్వాణానంతరం **400** సం వత్సరాలకు వజ్రయానం పేరుతో మంత్ర – తంత్రములు ప్రవే శించాయి. నిజానికి బుద్ధుడు వీటికి వ్యతిరేకి యని, పాళీని కాయముల ద్వారా తెలియుచున్నది.

దీర్ఘనికాయంలోని "బ్రహ్మజాల సుత్త"లో, ఈ మంత్ర – తంత్ర సాధనలు "తిరచ్చాన"ములని తిరస్కరించాడు. వీటి మయాజాలానికి లోను కావద్దని హెచ్చరించాడు.

కాని బుద్ధుని అనంతరం బౌద్ధం రూపురేఖలే మారిపోయాయి. విగ్రహారాధన వద్దని చెప్పిన బుద్ధుణ్ణే విగ్రహంగా చేసి ఆరాధించడం మొదలైంది. వ్యక్తి ఆరాధన నరనరాన మానవుని బలహీనత అన్నది రుజువైంది.

బుద్ధుని జీవిత ఘట్టాలు, శిల్పాలుగా మలచడంలో కళాత్మకంగా ఎంతో ఆహ్లాదంగానే యుంటుంది. కానీ చైత్యాలు – స్థూపాలు – మఠాలు తంత్రంవల్ల, స్త్రీల మఠప్రవేశం వల్ల భ్రష్టుపట్టిపోయింది. బుద్ధునిపై గల ప్రేమతో, బుద్ధుని వ్యక్తిత్వానికి జీవిత విధానానికి ముగ్ధులైన రాజులు – బౌద్ధం స్వీకరించి బౌద్ధాన్ని ఎంతో ఉన్నతస్థితికి చేర్చడంలో చాలా సహాయపడ్డారు.

కానీ వారి తదనంతర వైదిక మతాన్ని పోషించే రాజులు రావడం, వజ్రయాన తంత్ర విధానం వల్ల నీతి తప్పడం మొదలగు కారణాలవల్ల బౌద్ధం పతనమయ్యింది.

## దశమహావిద్యలలో, ఇద్దరు, బౌద్ధ దేవతలే

బౌద్ధతంత్రశాస్త్రం (వజ్రయానం) నుంచి అనేక ప్రక్రియలు, సాధనలు మంత్రానుకరణలు, యంత్రములు – మాత్రమే గాకుండా దేవతలుగా కూడా హిందూ తంత్రశాస్త్రంలో ప్రవేశపెట్టబడ్డారు. దశమహావిద్యలలో రెండు విద్యలు వజ్రయానంలోనివే అవి. 1. తార 2. ఛిన్నమస్త.

తారను, ఉగ్రతార, ఏకజటా, మహానీల సరస్వతి అని విభిన్న సాధనలుగా ఉన్నాయి. సాధనమాలలో ఎనిమిది రకముల తారా సాధన చెప్పబడినది. వశిష్ఠుడు మహాచీన దేశం (టిబెట్) వెళ్ళి తారను ఉపాసించినట్లు బృహన్నీలతంత్రం – మొదలగు గ్రంధాల్లో వివరించ బడినది.

తారాశక్తికి అధిపతి శివుడుగా "అక్షోభ్యుడు" పేర్కొనబడ్డాడు. ఈ అక్షోభ్యుడు బౌద్ధంలోని పంచధ్యానిబుద్ధులలో ఒకడు. గమనించండి.

శ్లో॥ జినో వైరోచన ఖ్యాతో రత్నసంభవ ఏవచ ।
అమితాభామోఘ సిద్ధి రక్షోభ్యశ్చ ప్రకీర్తితః ॥

1. వైరోచన 2. రత్న సంభవ 3. అమితాభ 4. అమోఘసిద్ధి 5. అక్షోభ్యుడు ఈ అయిదుగురూ ధ్యానిబుద్ధులు.

తార పంచాముద్రా సమన్వితా అని ధ్యానశ్లోకమందున్నది. పంచ ముద్రలు బౌద్ధ సంబంధమైనవే.



కంఠికారుచకం రత్నమేఖలం భస్మసూత్రకం ।
షట్వైపారమితా ఏతా ముద్రా రూపేణ యోజితా ॥

ఇందులోనివే పంచముద్రలు, హస్త ప్రదర్శితముద్రలు కాదు.

వజ్రశబ్దము వజ్రయానమందు అతి విస్తారముగా ప్రయోగించ బడినది. తారను వజ్రయోగిని అని కూడా వ్యవహరిస్తారు. కనుకనే, ఛిన్నమస్తా మూలమంత్రమునందు కూడా వజ్రవైరోచనీయని ఉన్నది.

ఛిన్నమస్తను పరివేష్టించియుండు ఇద్దరు యోగినుల పేర్లు వర్ణిని – డాకిని ఇరువురూ బౌద్ధశక్తులే. పద్మసంభవుని జీవిత చరిత్రలో హుం బీజముచే, కుండలినీ శక్తిని మేల్కొలిపి, డాకిని వలన బోధి సత్వుడైనట్లు వజ్రయాన గ్రంధాల్లో పేర్కొనబడింది.

వజ్రయానములో 9 సంప్రదాయములుండేవి.

1. శ్రావక్ యానము 2.ప్రత్యేకబుద్ధయానము 3. బోధిసత్వ యానము 4. క్రియాతంత్రయానము 5. ఉపాయతంత్ర లేదా చర్య 6. యోగ తంత్రయానము ఇదే మరల మూడు ఉపవిభాగములతో ఉండేది. 7. మహాయోగ తంత్రయానము 8. అనుత్తర యోగతంత్ర యానము 9. అతియోగ తంత్రయానము.

వారాహి కూడా బౌద్ధంలోని వజ్రవారాహియే. ఉచ్ఛిష్టగణపతి కూడా బౌద్ధంలోని రక్తగణపతియే. మహాకాలుని గూర్చి గూడా బౌద్ధ తంత్రంలో విస్తారమైన తంత్రసాహిత్యమున్నది.

సాధనమాలలో నెం **218**లో వజ్రవారాహి, ప్రజ్ఞాలోక అనే శవ సాధనలున్నవి. నాగార్జునుని రెండు సాధనలు సాధనమాలలో ఉన్నవి. **1.** వజ్రతార **2.** ఏక జటాసాధన.

కురుకుళ్ల ఒక బలిదేవత ఈమెకు **7 – 13 – 25** అక్షరములలో మూడు మంత్రములున్నవి. వజ్రయానంలోని ఒక శక్తియే కురుకుళ్ల.

బుద్ధుడు సర్వజ్ఞుడే. కపిలుడు సాంఖ్య తత్త్వప్రవక్త కూడా సర్వజ్ఞుడే మరి వారిద్దరికీ మతభేదమెందుకు? అనే ఈ విమర్శాత్మక శ్లోకం గమనించండి.

**శ్లో॥ సుగతో యది సర్వజ్ఞః కపిలోనేతి కాప్రమా ।**
**అథోభావపి సర్వజ్ఞౌ మతిభేదస్తయోః కథమ్ ॥**

## యక్షిణులు

సిద్ధనాగార్జున తంత్రంలో **30** యక్షిణీ సాధనలున్నవి. ఉడ్డామ రేశ్వర తంత్రంలో **36** యక్షిణీ సాధనలున్నవి. రెండు గ్రంధము లందూ యక్షిణుల పేర్లు సమానముగానే యున్నవి. యక్షిణీ సాధనలు చేయువారు గురువు పర్యవేక్షణలో చేయడం మంచిది.

ప్రస్తుతము సిద్ధనాగార్జునుని కక్షపుటి విషయమై ఇతర గ్రంధా లయములందు, అనగా పూనాలోని వ్రాతప్రతులు పరిశీలించనిదే ఇదమిత్థమని ఒక సమగ్ర అభిప్రాయమునకు వచ్చుట సమంజసము కాదు. అంతవరకూ ఇది ప్రామాణికమే అని భావించవచ్చు.



బౌద్ధనాగార్జునుని చిత్రము, నాగార్జునకొండ వద్ద జరిపిన త్రవ్వకాలలో లభించిన అతని దంతములు, అవశేషుల చిత్రము ఇందు ఇవ్వబడ్డాయి. కేవలం నాగార్జునిని మేధోద్భవమైన తాత్త్విక ప్రతిభా పాటవాల సిద్ధాంతానురాగము చేతనే, తెలుగువారందరికీ ఎంతో కొంత విషయం తెలియజేయాలనే ఆ విషయాలు వివరించాను.

అనుబంధంలో తంత్రవిషయాలు కొన్ని, అధనంగా చేర్చడం జరిగింది. దీనివలన కొంత ప్రయోజనం, జ్ఞానశాంతి కలుగుతాయని భావిస్తున్నాను.

మేడవరపు సంపత్ కుమార్

అహ్మదాబాద్,
**9 – 9 – 2009**

# విషయసూచిక

# సిద్ధ నాగార్జున తంత్రము

## (సిద్ధ నాగార్జున కక్షపుటమ్)

## ప్రధమం పటలం

శ్లో॥ యః శాంతః పరమాలయః పరశివః కంకాళమాల్యంతకో
ధ్యానాతీత - అనాది నిత్యనిలయః సంకల్ప సంకోచకః ।
ఆభాసాంతర భాసకః సమరసః సర్వాత్మనా బోధకః
సోఽయం శర్మ దదాతు సర్వజగతాం విద్యాది సిద్ధాష్టకమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పరమశాంత స్వరూపుడైన పరమశివుని, విద్యాసిద్ధి కొరకు, అష్టసిద్ధుల ప్రాప్తికి నమస్కరించుచున్నాను. ఈ పరమశివుడు ఎట్టివాడనగా కంకాళములు మాలగా ధరించినవాడు, అంతకస్వరూపుడు - ధ్యానాతీతుడు - అనాది - నిత్యపదార్థాశ్రయుడు - సమస్త సంకల్ప సమూహములను నాశనము



చేయువాడు. తన ప్రతిబింబము ద్వారా సమస్త వస్తు జాతమును (ప్రపంచమును) గోచరింప చేయువాడు - సమరస స్వభావుడు అయిన శివుడు జగత్తుకు సర్వమంగళములు అనుగ్రహించుగాక.

శ్లో॥ యా నిత్యా కులకేళి శోభిత వపుర్బోధోదితా జృంభతే
పూర్ణాభాఽమృత కుండలా పరపరా మంత్రాత్మికా సిద్ధిదా।
మాలా పుస్తక ధారిణీం త్రినయనాం కుందేందు వర్ణోజ్వలాం
నిత్యానందకుల ప్రకాశజననీం వాగ్దేవతా మాశ్రయే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ముందుగా తంత్రజ్ఞాన కారకుడైన శివుని మంగళాచరణమాచరించి, ఇపుడు వాగ్దేవతను స్తుతించుచున్నాడు.

వాగ్దేవత నిత్యాస్వరూపిణి, కులక్రీడచే ఆమె దేహము శోభించుచున్నది. పూర్ణదీప్తిశాలిని - అమృతకుండలధారిణి - శ్రేష్టమైన వాటికంటే శ్రేష్ఠమైనది. మంత్రస్వరూపిణి, సిద్ధిప్రదాయిని - మాలను ఒకచేత, పుస్తకమును ఒకచేత ధరించినది, త్రినయన - కుంద (మల్లెమొగ్గ) - చంద్రకాంతి వంటి వర్ణముతో విరాజిల్లునది. నిత్యానందాది సిద్ధులకు జనని వంటిది. ఇటువంటి విశేషణములు గల గీర్వాణిని భక్తితో నమస్కరించుచున్నాను.

శ్లో॥ యేషాం వక్త్రాత్ శృతం కించిత్ మణిమంత్రౌషధాదికం
తత్కర్మణి రతాత్ పూర్వం ప్రణమామి మహాజనాన్ ।
సంసారే బహు విస్తీర్ణే విద్యాసిద్ధి రనేకధా
ప్రోక్తవాన్ శంకరః సిద్ధైః మునిదేశిక సాధకైః

అన్యైర్దేవగణైః సిద్ధైః మునిదేశిక సాధకైః
యద్యదుక్తం హి శాస్త్రేషు తత్ సర్వమవలోకితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ప్రాచీనులైన మహర్షుల ద్వారా కొన్ని మణి, మంత్ర, ఔషధ మొదలగు ప్రయోగములను విని యున్నాను. వాటియందున్న ప్రీతిచే, వాటిని వివరించిన ఆ మహానుభావులకు ముందుగా నమస్కరించుచున్నాను.

ఎంతో విశాలమైన ఈ ప్రపంచములో అనేక విధములైన విద్యలు, సిద్ధులు కలవు. వీటి నన్నిటినీ ముందుగా వివరించమని అడిగిన పార్వతికి శంకరుడు సమస్త తంత్ర శాస్త్రమును బోధించి యున్నాడు.

ఇతర దేవతా గణములు – సిద్ధులు – సాధకులు – మునులు, దేశికులు ఇతర శాస్త్రములందు కూడా కొంత కొంత ఈశ్వరాను గ్రహముచే తంత్రవిషయములు చెప్పి యున్నారు. వాటినన్నిటినీ నేను సమగ్రముగా పరిశీలించితిని.

శ్లో॥ శాంభవే యామళే శాస్త్రే మౌలే కౌలేయ డామరే ।
స్వచ్ఛందే కాకులే శౌచే రాజతంత్రేఽమృతేశ్వరే ॥
ఉడ్డీశే వాతులే తంత్రే హ్యుచ్ఛిష్టే సిద్ధిశాబరే
కింకిణ్యాం మేరుతంత్రే చ కాలచండేశ్వరే మతే ।
శాకినీ డాకినీ తంత్రే రౌద్రేఽనుగ్రహ నిగ్రహే
కౌతుకే శల్యతంత్రే చ క్రియాకాలగుణోత్తరే ।



హరమేఖలకే గ్రంథే ఇంద్రజాలే రసార్ణవే
ఆధర్వణే మహావేదే చార్వాకే గారుడేఽపి చ ।
ఇత్యేవమాగమోక్తంచ వక్త్రాత్ వక్త్రేణ యత్‌శృతం
ఏతత్ సర్వం సముద్ధృత్య దధ్నో ఘృతమివాదరాత్
సాధకానాం హితార్థాయ మంత్రఖండ మిహోచ్యతే ॥

## సాధకుల హితము కోరి మంత్రఖండం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఈ గ్రంథమునందు కొన్ని అపురూప మంత్ర తంత్ర విషయములు సాధకుల హితము కోరి వివరించుచున్నాను.

కొన్ని సాధనలు ఈ క్రింది గ్రంథములనుండి సేకరించడం జరిగినది. శాంభవతంత్రం – యామళం – మౌళం – కౌలేయం – డామరం – స్వచ్ఛందతంత్రం – కాకులం – శౌచం – రాజతంత్రం – అమృతేశ్వరం – ఉడ్డీశం – వాతుల శుద్ధీతంత్రం – ఉచ్ఛిష్టం – సిద్ధితంత్రం.

శాబరతంత్రం – కింకిణీతంత్రం – మేరుతంత్రం – కాల చండేశ్వరం – శాకినీ తంత్రం – డాకినీ తంత్రం – రౌద్రం – అనుగ్రహం – నిగ్రహం – కౌతుకం – శల్యతంత్రం – క్రియా – కాలగుణోత్తర తంత్రం – హరమేఖల – ఇంద్రజాలం.

రసార్ణవం – అథర్వణవేదం – మహావేదం – చార్వాకం – గారుడం మొదలగు గ్రంథములనుండి, ముఖాముఖి గ్రహించినది,

సమస్తమూ సారము గ్రహించి పెరుగు నుండి వెన్నను గ్రహించినట్లు సాధకుల హితముకోరి, లోకోపకారార్థము ఈ "మంత్రఖండము" వివరింపబడుచున్నది.

శ్లో॥ వశ్యమాకర్షణం స్తంభం మోహముచ్చాట మారణం
విద్వేష వ్యాధికరణం పశుసస్యార్ధనాశనమ్ ।
కౌతుకం చేంద్రజాలం చ యక్షిణీ మంత్రసాధనం
చేటకంచాంజనం దివ్యమదృశ్యం పాదుకాగతిమ్ ।
గుటికాఖేచరత్వంచ మృత సంజీవనాదికం
తథా కక్షపుటీ సిద్ధిః సాంగోపాంగమనేకధా ।
సుసాధ్యం ప్రత్యయోపేతం సాధకానాం హితం ప్రియం
తత్తన్మంత్ర ముఖం జ్ఞాత్వా కర్తవ్యం సిద్ధిమిచ్ఛతా ।
మంత్రసాధనకం పూర్వం సిధ్యర్థం సాధకోత్తమైః
వినామంత్ర విధానేన నసిద్ధిం లబ్ధవాన్ భవేత్ ॥

## కక్షపుటీ వివరణ

ఈ గ్రంధమునందు కక్షపుటీ సాధనలు వివరింపబడుచున్నవి. వశీకరణం - ఆకర్షణం - స్తంభనం - మోహనం - ఉచ్చాటనం - మారణం - విద్వేషణం - వ్యాధికరణం మొదలగునవి.

పశునాశనం - సస్యనాశనం - అర్ధనాశనం - ఇంద్రజాలం - ఆశ్చర్యకర విషయములు - యక్షిణీసాధనలు - చేటక సాధన - అంజన సాధన - దివ్యసాధన - అదృశ్య సాధన.



పాదుకాసాధన - గుటికా సాధన - ఖేచర సాధన - మృత సంజీవని మొదలగు అన్నీ సాంగోపాంగముగా సాధకుల హితము కోరి వివరింపబడుచున్నవి.

నమ్మకము గల విశ్వసింపదగిన గురువు నుండి మంత్రమును గ్రహించవలయును. దానికి అనుగుణముగా సాధనము చేయ వలయును. మంత్రసాధన సక్రమముగా, శాస్త్రోక్త విధానములో ఆచరించనిచో ఫలితము శూన్యము.

## మంత్ర విచారము

శ్లో॥ అథ మంత్రాంశకం వక్ష్యే మేరుతంత్రే శివోదితే
మంత్రసాధకయోర్వర్ణాన్ స్వరాంశ్చ క్రమతః పృథక్।
విధాయ సిద్ధ సాధ్యాద్యైః గణయేన్మంత్ర విత్తమః
మంత్రం విచార్య క్రమేణ సాధయేత్ క్రమతః పృథక్।
విధాయ సిద్ధసాధ్యారి సుసిద్ధాన్ మంత్రవిత్తమః
అనుస్వారం విసర్గంచ జిహ్వామూలీయ సంజ్ఞకమ్।
సహితోచ్చరణాత్ ప్రాప్తం క్లీబవర్ణైరసంయుతమ్
వ్యంజనైః వ్యంజనం శోధ్యం స్వరైర్నామ స్వరాంస్తథా।
ఆద్యమాద్యేన సంశోధ్యం ద్వితీయేన ద్వితీయకమ్
అనేనైవ ప్రకారేణ శేషాః శోధ్యాః యథాక్రమమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శివుడు మేరుతంత్రము నందు వివరించిన మంత్రాంశములను వివరించుచున్నాను.

సాధకునియొక్క నామాక్షరములను, మంత్రముయొక్క ఆద్యక్షరములను సిద్ధ - సుసిద్ధ - సాధ్యాదులను పరిశీలించ వలయును.

అనుస్వారముతో కలసినది, అనగా "సంపత్" అను నామము నందు "సం" అనునది ఒక అక్షరముగానే పరిగణించవలయును. అదేవిధముగా విసర్గ, జిహ్వామూలీయములు, అపభ్రంశ అక్షరము లను పరిగణించవలయును.

అచ్చులతో అచ్చులను, హల్లులతో హల్లులను శోధించ వలయును. మొదటి అక్షరముతో మొదటి అక్షరమునూ, రెండవ అక్షరముతో రెండవ అక్షరమునూ శోధించవలయును.

శ్లో॥ ఆద్యంయదక్షరం నామ్నః స్థాపయేత్తు తదాదితః
ఏవం మంత్రాక్షరంస్థాప్యం మంత్రాంకానామయంక్రమః ।
చతుష్కంచ చతుష్కంచ పరిత్యాజ్యం పునః పునః
సిద్ధసాధ్య సుసిద్ధారి సంజ్ఞయైవ యథాక్రమం ।
ఏవంక్రమేణ సర్వేషాం మంత్రాణాం గణనేకృతే
కియత్ సిద్ధం కియత్ సాధ్యమిత్యాద్యపి విచింతయేత్ ।
యత్రమంత్రే భవేదేతత్ సిద్ధాదీనాం చతుష్టయం
సమంత్రః సిద్ధఇత్యుక్తః సాధ్యోవై సిద్ధివర్జితః



రిపు వర్జం యత్రమంత్రం సాసుసిద్ధిరిహోచ్యతే
సుసిద్ధమరిహీనంచ మంత్రంయత్ శత్రుభూషితమ్ ।

## సిద్ధాదిశోధన

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సిద్ధ - సాధ్య - సుసిద్ధ - అరి, అనే నాలుగు గడులు లిఖించాలి. ఇందు అచ్చులు హల్లు లిఖించాలి. పిమ్మట నామముయొక్క మొదటి అక్షరము, మంత్రము యొక్క మొదటి అక్షరము ఏ గడులందు వచ్చినవో గమనించాలి.

రెండింటిలో సిద్ధిగడి రానిచో అది సాధ్యమంత్రమని తెలుసు కోవాలి. అరిగడి రానిచో అది సుసిద్ధమని గ్రహించాలి.

శ్లో॥ ఆదిసిద్ధోఽంతసిద్ధోయం మధ్యసిద్ధోఽథవాభవేత్
సుసిద్ధాః సతువిజ్ఞేయః సాధకానాం ఫలప్రదః ।
ఆదావంతే సుసిద్ధోయం త్రైలోక్యమపి దాస్యతి
ఆదావంతేచ సాధ్యోయః సోఽతికాలేన సిధ్యతి ।
ఆదావంతేచ యః శత్రుః సాధకం మారయత్యలం
సిద్ధః సిధ్యతి కాలేన సాధ్యోఽథ జపహోమతః ।
సుసిద్ధః స్మరణాద్దేవి రిపుః సాదక మారకః ।
ఏవం మంత్రాంశకం జ్ఞాత్వా సుసిద్ధః సిద్ధమేవచ
సాధ్యం చాపి క్వచిద్ గ్రాహ్యం సిద్ధార్థం మంత్రముత్తమమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మంత్రము ఆదిసిద్ధి, అంతసిద్ధి లేదా మధ్యసిద్ధి అయినచో అది సుసిద్ధము వంటిదే యని చెప్పవచ్చును. అది సాధకునికి ఫలప్రదమగును.

ఆద్యంతములందు సుసిద్ధమైనది. అఖండ సంపదలిచ్చును. అలాగే మంత్రము ఆద్యంతములు సాధ్యమైనచో అది దీర్ఘకాలములో ఫలితమిచ్చును. ఆద్యంతములందు అరి అయినచో అది సాధకుని నాశనము చేయును.

సిద్ధమంత్రము సకాలములో సిద్ధించును. సుసిద్ధమంత్రము అతిశీఘ్రముగా సిద్ధించును. స్మరణమాత్రముననే సిద్ధించును. అరిమంత్రము సాధకుని చంపును, లేదా మరణ సదృశములైన కష్టముల నిచ్చును.

ఈ విధముగా మంత్ర శోధన చేయవలయును. సిద్ధము, సుసిద్ధము అయిన వాటినే గ్రహించాలి. సాధ్యము పరవాలేదు, కష్టసాధ్యము. అరి మంత్రము గ్రహించరాదు. అరవణము చూచుట అని దీనినే అందురు. కుదిరిన మంత్రము గ్రంధము ద్వారా గాని, గురుముఖముగాగాని గ్రహించి సాధన చేయాలి.

(శాస్త్రముఖముగా మంత్రము గ్రహించవచ్చునని ఇందు స్పష్టముగా చెప్పబడినది. లేదా దక్షిణామూర్తిని గురువుగా భావించి మంత్రగ్రహణము చేయవచ్చు. ఆ వివరములు నాచే అనువదించ బడిన "మేరుతంత్ర సంగ్రహము" నందు పరిశీలించడి.

– మేడవరపు సంపత్ కుమార్)



## సాధనాస్థలములు

శ్లో॥ పురేవా పత్తనే గ్రామే కటకే సింధుసంగమే
వనే చోపవనే తీర్థే మహాపీఠే చ సాగరే ।
పర్వతే సిద్ధవృక్షే చ కులవృక్షే శ్మశానకే
మాతృగేహే గుహాయాంవా పుణ్యక్షేత్రే మహానదే ।
సిద్ధమంత్రే శివస్థానే గృహేవాథ యథోదితే
దీపస్థానం సునిశ్చిత్య కూర్మచక్రే సుసిద్ధదమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇంటియందు, నగరం, గ్రామం, పర్వత శిఖరం, నదీ సాగర సంగమ స్థలమందు, వనము నందు, ఉపవనమందు, తీర్థమునందు, మహాపీఠ – శక్తిపీఠము లందు, పుణ్యక్షేత్రములందు, జ్యోతిర్లింగ క్షేత్రములందు మంత్రజప సాధన చేయాలి.

శివాలయమునందు, కూర్మచక్రము నందు దీపస్థానమును నిశ్చయము చేసుకొని సాధకుడు జపసాధన కొనసాగించాలి.

## కూర్మచక్రము

శ్లో॥ సప్తవర్గం లిఖేద్దీమాన్ మధ్యతో యావదుత్తరం
లక్ష్మీశపదేక్షేత్రే వేదాస్తే నవకోష్ఠకే ।
హృదాస్యభుజ కుక్ష్యంఘ్రి పుచ్ఛం వర్ణక్రమాత్ స్థితాః
పదాని దీపసంజ్ఞాని తేషుక్షేత్రాధిపాలకః ।

అమృతం వృషభంచైవ శైలరాజం చ వాసుకిం
అమరాజరకంచైవ పూజ్యంశక్తియుతం తథా ।
పద్మయోని ర్మహేశంఖో జ్ఞేయస్తంత్రాదనుక్రమాత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఉత్తర - దక్షిణముగా 4 రేఖలు గీయాలి. నాలుగు సంయుక్త రేఖలమధ్య **2 - 2** రేఖలు గీసి **9** గడులు ఏర్పరచాలి. తూర్పునుండి ఉత్తరదిశగా **7** వర్గులు లిఖించాలి. ఈశాన గడియందు ల - క్ష లిఖించాలి. వర్గులు క - చ - ట - త - ప - య - శ వర్గులు. మధ్యగడిలో అచ్చులు లిఖించాలి. హృదయే ముఖ - రెండు చేతులు **2** ఉదర పార్శ్వములు - రెండు కాళ్ళు - పృష్ఠములందు వర్ణక్రమం ఉండును.

మిగిలినవి కోశమనబడును. ఇందు దీప అనే క్షేత్రపాలు డుండును. సాధకుడు అమృతస్వరూపుడైన శివుని, హిమవంతుని, వృషభుని, వాసుకిని, మృత్యుంజయ శక్తిని, క్షేత్రపాలుని అర్చించాలి.

| | | |
|---|---|---|
| ల - క్ష | క ఖ గ ఘ ఙ | చ ఛ జ ఝ ఞ |
| శ ష స హ | అ నుంచి అః వరకు | ట ఠ డ ఢ ణ |
| య ర ల వ | ప ఫ బ భ మ | త థ ద ధ న |



అనంతరం క్షేత్రపాలుని ఈ మంత్రంతో అర్చించాలి.

ఓం (అముక) క్షేత్రపాల అమృతదేవీ పుత్ర అవతారము వల్లిం నిపితం గృహ్ణ, ఓం ఖ ఖ ల ల ఖ ఖ ల ల క్షేత్రపాల సర్వవిఘ్నాన్ హనహన స్వాహా ॥

శ్లో॥ మధ్యాత్ పూర్వాదితః పూజ్యా మంత్రమత్రైవ కథ్యతే
యత్రయత్ర భవేద్ వర్గే క్షేత్రాణామాద్యమక్షరమ్ ।
తన్ముఖం శేషవర్గేషు కురకుక్ష్యంఘ్రికల్పనా
ముఖస్థః క్షోభతే యంత్రీ కరస్థః స్వల్పభోగభాన్ ।
కుక్షిస్థితో హ్యుదాసీనః పాదస్థో దుఃఖమాప్నుయాత్
పుచ్ఛస్థితో వధంబంధం తత్తదాప్నోతి నిశ్చితమ్ ।
దీపస్థానమతః క్షేత్రం జ్ఞాత్వామంత్రం శుచిర్జపేత్
క్షేత్రేసాధనమంత్రాణా మేకమేవాద్యమక్షరమ్ ।
యదిస్యాద్ స ధ్రువం మంత్రం క్షిప్రమేవసుసిధ్యతి
జపమాలాది సిద్ధాంతా మంత్రాణాం సాధనోచ్యతే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** చక్రంలో ముందుగా మధ్య గడిని పూజించి అటు పిమ్మట, తూర్పుదిశ మొదలుగా అనగా క వర్గాదిగా పూజించాలి. ఏ వర్గులో సాధకుడు నివసించుచున్న నగరం, లేదా గ్రామం యొక్క మొదటి అక్షరమున్నదో పరిశీలించాలి. ఇదే క్షేత్రపాల శోధన. అదే ముఖముగా కల్పించి, తదనంతర గడులు, బాహ్వాదిగా పరిగణించాలి. మధ్యస్థానము హృదయము.

వీటిలో ముఖస్థానమునందుండి జపము ప్రారంభించినచో క్షోభ కలుగును. హస్తములందు అల్పభోగ భాగ్యములు కలుగును. కుక్షియందు ఔదాసీన్యమేర్పడును. పాదములందు దుఃఖము ఏర్పడును. పుచ్ఛమందు బంధనము, కష్టము కలుగును. దీపస్థానము తెలిసి జపము చేసిన సిద్ధి కలుగును.

క్షేత్రస్థానముయొక్క మొదటి అక్షరము, సాధకుని పేరులో మొదటి అక్షరము, మంత్రము యొక్క మొదటి అక్షరము ఒకటే అయినచో శీఘ్రముగా సిద్ధి కలుగును. **జప ప్రారంభమునుండి సిద్ధివరకు పట్టు కాలమే సాధన అనబడును.**

## జపమాలలో మణుల సంఖ్య

శ్లో॥ అష్టోత్తరశతంచైవ చతుఃపంచాశదేవవా ।
సప్తవింశత్ మణిర్వాథ కర్తవ్యా జపమాలికా ॥
ఉత్తమామధ్యమాహీనా త్రిధాప్రోక్తా క్రమేణతు
బ్రహ్మగ్రంధాన్వితాప్రోక్తా మేరుతంత్రే శివోదితా ॥
మంత్రప్రత్యక్షతా సిధ్యై శాంతికే వాథ పౌష్టికే
స్ఫాటికీ మౌక్తికీ వాపి ప్రోతవ్యాసితసూత్రవైః ॥
సర్వకామప్రసిధ్యర్థం జపేద్ రుద్రాక్షమాలయా
ధర్మార్థ కామ మోక్షార్థీ జపేత్ పద్మాక్షమాలయా ॥
సారస్వతే ప్రవాళోత్థా వశ్యేసైవప్రకీర్తితా ।
పద్మరాగమయీవాపి నమస్తే పుత్రజీవకా ॥



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మంత్రసాధనకు తప్పని సరిగా జపమాల ఉపయోగించాలి. జపమాలలో పూసలసంఖ్య **108 – 54 – 27** ఉండవచ్చు. ఇవి క్రమముగా ఉత్తమ – మధ్యమ – హీనములని చెప్పబడును. వీటికి తప్పక బ్రహ్మగ్రంధిని ఏర్పాటు చేయాలని మేరుతంత్రమునందు శివునిచే చెప్పబడినది.

శాంతి – పుష్టి కర్మలందు తెల్లని దారముతో ముత్యములు – లేదా స్ఫటికములూ గ్రుచ్చాలి. సర్వకామములూ సిద్ధించవలెనన్న "రుద్రాక్షమాల"తో జపించాలి. ధర్మార్థకామ మోక్షములు కోరువారు పద్మబీజముల మాలతో జపం చేయాలి.

విద్యాసిద్ధికి, వశీకరణమునకు పగడమాల పద్మరాగమాల శ్రేష్ఠము. మిగిలిన సమస్త కార్యములందు పుత్రజీవికామాల ఉపయోగించాలి.

శ్లో॥ వేగాదుచ్చాటయేత్ శత్రుం మహాదేవేన భాషితం
గర్దభస్య హ్యథోదంతైః మణింకృత్వా చ బాలకైః ।
జపమాలా ప్రకర్తవ్యా శత్రూణాంమార కర్మణి
లోమ్నాపూలస్య సూత్రేణ ప్రోతవ్యా కార్యసిద్ధిదా ।
ప్రేతదంతై రథోద్భూతా కర్తవ్యా జపమాలికా
సాధ్యదేహనఖైః కేశైః గథితాద్వేష కర్మణి ।
మణిభిః శంఖసంభూతైః అక్షమాలార్థ సాధనే
నిధాన యక్షిణీసిధ్యై ప్రోతవ్యా సిత సూత్రకైః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శత్రూచ్చాటనము కొరకు, గాడిదయొక్క అధోదంతములతో మాల నిర్మించి దానితో జపం చేయాలి. పుల్య పశువుయొక్క రోమములతో మాల నిర్మించి జపించిన అభిచార కర్మలన్నీ సిద్ధించును.

విద్వేషణ సిద్ధికొరకు మృతవ్యక్తి దంతములతో నిర్మించిన మాల, సాధ్యవ్యక్తి నఖ కేశములతో గ్రథనం చేసి జపించాలి. ధనసాధన కొరకు, నిధులసిద్ధికి శంఖమాల శ్వేతసూత్రముతో నిర్మించి జపించాలి.

## జపములో అంగుళినియమం

శ్లో॥ అంగుష్ఠా నామికాభ్యాంతు జపేదుత్తమ కర్మణి
అంగుష్ఠ మధ్యమాభ్యాంతు జపేదా కృష్ట కర్మణి ॥
తర్జన్యంగుష్ఠయోగేన విద్వేషోచ్చాటనేజపః
కనిష్ఠాంగుష్ఠకాభ్యాంతు జపేన్మారణ కర్మణి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శాంతి - పుష్టికర్మలు సాధించు సాధకులు జపమాలను అంగుష్ఠ అనామికలతో మాత్రమే స్పృశించుతూ జపం చేయాలి. ఇతర వ్రేళ్లు తాకరాదు. ఆకర్షణ, వశీకరణమందు అంగుష్ఠమధ్యమవేళ్ళు ఉపయోగించాలి.

విద్వేషణ - ఉచ్చాటన కర్మలందు అంగుష్ఠ తర్జనీ వ్రేళ్ళను ఉపయోగించాలి. మారణకర్మకు అంగుష్ఠ - కనిష్ఠకలతో జపం చేయాలి.



## జప సమయములు

శ్లో॥ ఉదయాత్ యామ పర్యంతం హేమంతే పౌష్టికే జపేత్
యామద్వయం పూర్వరాత్రే శిశిరే మారణేజపేత్ ।
వసంతే ప్రహరాద్ ఊర్ధ్వం యామద్వయమితే జపేత్
కార్యమాకర్షణంతత్ర మంత్రై రిష్టస్య వస్తునః ॥
గ్రీష్మేతృతీయకే యామేఽభిహితోద్వేష కర్మణి
తతోఽస్తమయ పర్యంతముచ్చావే తోయదాగమే ।
అర్థరాత్రే నిశాంతే చ జపేత్ శరిది శాంతికే ॥

- మతాంతరమందిట్లున్నది -

శ్లో॥ యస్మిన్ కస్మిన్ ఋతౌకార్యం మంత్రాణాం సాధనం శుభం
పూర్వాహ్ణే వృష్టి పుష్ట్యర్థం మధ్యాహ్నే ప్రీతినాశనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పుష్టికర్మలు హేమంత ఋతువులో సూర్యోదయము నుండి ఒక జాము వరకు జపించవచ్చు. మారణకర్మ శిశిర ఋతువునందు రాత్రి ప్రథమము నుండి రెండుజాముల వరకు జపించాలి. ఆకర్షణ - వశ్యములకు వసంత కాలములో ప్రథమప్రహరము తొలిజామునుండి రెండుజాముల వరకు పగలు జపించవచ్చు.

విద్వేషణ కార్యములకు పగలు మూడవ జామునుండి సూర్యాస్తమ పర్యంతమూ జపించవచ్చు. ఉచ్చాటన కార్యములకు

వర్షాకాలములో అర్ధరాత్రి యందును, శాంతి కర్మలకు శరత్ కాలములో ప్రభాతసమయములో జపించాలి.

ఈ జపకాల సమయములను గూర్చి భిన్నాభిప్రాయము లిట్లున్నవి. మంత్రసాధన ఏ ఋతువునందైననూ చేయవచ్చు. వశీకరణ – పుష్టికర్మలు పూర్వాహ్ణమునందునూ, విద్వేషణ కర్మ మధ్యాహ్నమునందునూ, ఉచ్చాటన అపరాహ్ణమునందునూ, మారణ కర్మ సాయంకాలమునందూ జపించాలి.

శ్లో॥ సోమదేవ గురూపేతాః పౌష్టికేఽభిహితా బుధైః
అష్టమీనవమీచైవ దశమ్యేకాదశీతథా ।
శుక్రభాను సుతోపేతా ప్రశస్తాఽఽకృష్టకర్మణి
అష్టమీ పౌర్ణమాసీ చ ప్రతిపన్నవమీ తథా ।
శుక్రభాను సుతోపేతా ప్రశస్తాద్వేషకర్మణి ॥
తతశ్చతుర్దశీ కృష్ణా శనివారే తథాష్టమీ
ఉచ్చాటనేఽతి శస్తేయం జపేచ్ఛంకర భాషితా ।
అమావాస్యాష్టమీ కృష్ణా తాదృశీ చ చతుర్దశీ
భానునా తత్సుతోపేతా భూసుతేనాథసంయుతా ।
మారయేదద్భుతం హోమాద్రక్షితం శంఖునాపివా
ఏవం సిధ్యంతి కర్మాణి తిథివారానుసారతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సోమ – గురువారములు, అష్టమీ – నవమి – దశమి – ఏకాదశి కలసిన రోజున పుష్టికర్మలు ఆచరించిన, జపించిన సిద్ధించును. శుక్ర – శనివారములూ, అష్టమి – నవమి – పూర్ణిమ – పాడ్యమి కలసినచో ఆకర్షణ కర్మలు సిద్ధించును.



శనివారం, బహుళచతుర్దశి (మాసశివరాత్రి) బహుళ అష్టమి కలసినరోజున ఉచ్చాటన కర్మ సిద్ధించును. ఆది – శని – మంగళ వారములందు బహుళాష్టమి, చతుర్దశి – అమావాస్య కలసినరోజున హోమం చేసిన సాధ్యవ్యక్తిని మహాదేవుడు కూడా రక్షించలేడు.

ఈ విధముగా తిథివారములు కలసినరోజులు, ఆయా కర్మలకు ప్రశస్తమని కొందరి అభిప్రాయము.

## జపమందు ఆసన నియమములు

శ్లో॥ యథోక్తాసనమారూఢో జపం మంత్రీ సమాచరేత్
కుశాజినేంబరే రక్తే చతురంగుళ మూర్ధ్వతః ।
చతురస్రం ద్విహస్తంచ సుదృఢం మృదు నిర్మితం
తత్రోపరి నియుంజీత యోగమంత్రస్య సిద్ధయే ।
వదన్నశ్నన్ స్వపన్ వాఽన్యమాశ్రయన్ కిమపిస్మరన్
క్షుత్తృడ్ జృంభణి హిక్కాది వికలీకృతమానసః ।
మంత్రసిద్ధిం న చాప్నోతి తస్మాద్యత్నపరోభవేత్
వ్యాఘ్రచర్మాసనం వశ్యే మోక్షే చ ధనసాధనే ।
ఆకృష్టౌ యద్యదిష్టంస్యాత్ వారణం శాంతిపౌష్టికే

ఉచ్చాటే మాహిషం చర్మ మారణే నరకేశజమ్ ।
శాంతికే స్వస్తికేప్రోక్తం పౌష్టికే పంకజాసనం
ఆకృష్టే పౌష్టికం జ్ఞేయం విద్వేషే కుక్కుటాసనం ।
అర్ధస్వస్తికముచ్చాటే అర్ధోత్థానస్తు మారణే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శాస్త్రోక్తమైన ఆసనము నందు కూర్చొని జపసాధన చేయాలి. కుశాసనము - అజినాసనము - రక్తవర్ణకంబళి - చతురస్రముగా ఉండాలి. ఇవి మంత్ర సాధనకు శ్రేష్ఠము.

రెండు హస్తముల ప్రమాణములో 4 అంగుళములు ఎత్తులో ఉండాలి. దృఢంగా ఉండాలి. జపము చేయు సమయమునందు మాట్లాడుట - నిదురపోవుట అన్యమనస్కముగా నుండుట తగదు.

ఆకలి - దాహం - ఆవలింత - వళ్లువిరుచుకొనుట, ఎక్కిళ్లు ఇవి చేయరాదు.

పులిచర్మముపై మంత్రజపము చేసిన, వశీకరణము- మోక్షము - అర్ధసాధన సిద్ధించును. ఆకర్షణ సిద్ధికి తనకు ఇష్టమైన ఆసన మందు చేయవచ్చును. శాంతి - పుష్టికర్మలందు, గజ చర్మాసనము శ్రేష్ఠము.

ఉచ్చాటనకు మహిషచర్మాసనము - మారణకర్మకు నృకేశాస నము, శాంతి కర్మలో స్వస్తికాసనము, పౌష్టికమందు కమలాసనములు ప్రశస్తములు.



కూర్చొనే విధానములో ఆకర్షణలో పార్ష్ణిణాసనము, విద్వేషణలో కుక్కుటాసనము, ఉచ్చాటనలో అర్ధస్వస్తికాసనము, మారణమందు అర్థోత్థానాసనము శ్రేష్ఠములు.

## జపస్థానములు - దిక్ నియమములు

శ్లో॥ మహాకాళ్యాశ్చ దుర్గాయా వశ్యేప్రోక్తం శివాలయే
ఆకృష్టౌ నియమోనాస్తి విద్వేషార్థం శ్మశానకే ।
ఉచ్చాటనం కుత్సితే చ శూన్యేదేవాలయోపరి
శ్మశానే కాళికాక్షేత్రే ప్రేతమారుహ్యామంత్రవిత్ ।
దక్షిణాభిముఖో భూత్వా దంతైః సంపీడ్య చాధరమ్
రిపుం స్మృత్వా జపం కుర్వన్ సప్తరాత్రేణమారయేత్।
వాసనాఽత్ర యధాప్రోక్తా కర్మషట్కానురూపిణీ
శాంతికే సౌమ్యరూపాసా పౌష్టికే వశ్యకర్మణి ।
కాకోల్లూకాదిభిః శత్రుం భక్ష్యమాణం మృతం స్మరేత్
ఇత్యేవం వాసనాకార్యా స్నానధ్యానమథోచ్యతే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** వశీకరణసిద్ధికి శివా లయమునందును, మహాకాళీ దుర్గాజపము లాచరించాలి. ఆకర్షణ కర్మకు నియమములు లేవు. విద్వేషణార్థము రుద్రస్థానమున ఉచ్చాట నకు పాడుబడిన దేవాలయమందును జపమాచరించాలి.

అభిచారకర్మలు దక్షిణముఖంగా చేయాలి. జపకాలమందు షట్ కర్మానుసారముగా భావించాలి. శాంతి – వశీకరణ, పుష్టి కర్మలందు సౌమ్యరూపము, సద్భావన ఉండాలి.

## ధ్యానస్థానములు

శ్లో॥ చతుష్పత్రాంబుజే గుహ్యే కుర్యాన్మూలే మనః స్థిరం
రససిద్ధిం తథా వశ్య మాకృష్టిం కాలవంచనమ్ ।
జపనాత్ విషభూతాది కార్యారంభం గమాగమౌ
సారస్వతం స్తంభనం చ వామవాహేన సాధయేత్ ।
హృత్పద్మ కర్ణికాం ధ్యాయన్ స్థిరచిత్తేన యోజయేత్
లభతే పౌష్టికీం సిద్ధిం శత్ర్వాచ్చాటన మారణే ।
విద్వేషే రవివాహేన వరనారీ విమోహనం
శాంతికం పౌష్టికం వశ్యం సాధయేచ్ఛం కరోదితమ్।
భ్రువోర్మధ్యే ద్విపత్రే చ దక్షవాహేన సాధయేత్
క్షుద్రవిద్యా మహావిద్యా మోక్ష కౌతూహలాని చ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** జపము ప్రారంభించు సమయమున మూలాధారమందున్న చతుర్దళ పద్మమందు మనస్సు స్థిరముచేసి, రససిద్ధి వశీకరణ – ఆకర్షణ – కాలవంచన – విష భూతాది కార్యారంభములు – గమన నిర్గమనములు – సారస్వత సిద్ధి – స్తంభనకర్మ – ఎడమ ముక్కునందు వాయు సంచార కాలమున జపించవలయును.



హృదయకమలమందు ధ్యాన – జపములు చేయుచూ స్థిరచిత్తముతో ఏకాగ్రతతో పౌష్టిక – ఉచ్చాటన – మారణకర్మలు ఆచరించాలి.

కుడిముక్కులో వాయు సంచారకాలమున అనగా సూర్యనాడి కాలమున మోహన – శాంతి – వశీకరణ కర్మలాచరించాలి. దక్షిణ నాసికయందు వాయు సంచార కాలముననే భ్రూమధ్యగత ద్విదళ పద్మమునందు ఆజ్ఞాచక్రమున మనస్సు నిలిపి క్షుద్రవిద్య మహావిద్య – మోక్షవిద్య – ఇంద్రజాల విద్యలు సాధించాలి.

శ్లో॥ యస్యమంత్రస్య యద్ ధ్యానం ధ్యాయేత్ స్థానగతంబుధః
అథవా సర్వమంత్రాణాం ధ్యానం సిద్ధికరం శృణు ।
శుద్ధ స్పటికసంకాశం శాంతికే పౌష్టికే శుభే
సారస్వతే రసే మోక్షే ఖేచరత్వే రసాతలే ।
సారక్తా సర్వవశ్యేషు స్తంభనే మోహనేఽపి చ
ఆకర్షణే బ్రహ్మవాదే కౌతుకే సిద్ధిదాయినీ ।
ఏవం ధ్యాత్వా జపం కుర్యాన్మానసోపాంశువాచికం
శాంతికేపౌష్టికే మోక్షే మానసం జపమాచరేత్ ।
వశ్యాకృష్టావుపాంశు స్యాద్వాచికం క్షుద్రకర్మణి
శనైః శనైః సువిస్పష్టం నద్రుతం న విలంచితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఏ మంత్రమునకు ఏ ధ్యానము చెప్పబడినదో దానిని తప్పక ఆచరించాలి. పౌష్టిక – శాంతి

కర్మలందు మంత్రదేవతను శుద్ధస్ఫటిక సంకాశంగా ధ్యానించాలి. సారస్వతం (విద్యాప్రాప్తి కవిత్వసిద్ధి) మోక్షసాధన - ఖేచరత్వ సాధనలు మొదలగు వాటికి కూడా ఇలాగే భావించాలి.

వశీకరణ - స్తంభన - మోహన - ఆకర్షణ బ్రహ్మవాద - ఇంద్ర జాల సాధనలయందు, రక్తవర్ణ ధ్యానం చేయాలి. ఉచ్చాటన - విద్వేషణ లందు పసుపు వర్ణమును మారణ కర్మయందు నలుపు వర్ణ దేవతను ధ్యానించాలి.

ఇటువంటి ధ్యానము పిమ్మట మానసిక - ఉపాంశు - వాచిక విధానములలో జపం చేయాలి. శాంతి - పౌష్టిక - మోక్షసాధనము లందు మానసిక జపము ఫలప్రదమగును. వశీకరణము మరియు ఆకర్షణయందు ఉపాంశుజపము, క్షుద్ర కార్యములందు వాచిక జపము ప్రశస్తములు. జపము అతినెమ్మదిగా గాని, అతిశీఘ్రముగా గాని చేయరాదు.

శ్లో॥ జపం సప్రణవం కుర్యాత్ సర్వకామార్థ సిద్ధయే
జపప్రారంభ కాలేతు మంత్రాయార్ఘ్యం ప్రదాపయేత్।
నాతిరిక్తం చ న్యూనం చ జపంకుర్యాత్ సునిశ్చితం
జపస్య చ దశాంగేన హోమంకుర్యాత్ దినేదినే ।
అథవాలక్ష పర్యంతం హోమఃకార్యో విపశ్చితా
గవ్యక్షీరాజ్య మధుభిర్వశ్యే పౌష్టిక కర్మణి ।
త్రికోణే వృత్తకుండే వా వాయవ్యాభిముఖోహునేత్



లవంగఃశ్రీఫలం జాతీ ప్రియంగుః కింశుకం తథా ।
పంచద్రవ్యైర్మితం హోమం కుర్యాదా కృష్టకర్మణి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సర్వకార్యసిద్ధికి ప్రణవ యుక్తంగా మంత్ర జపం చేయాలి. నిర్దిష్ట సంఖ్యలోనే జపం చేయాలి. హెచ్చుతగ్గులుండరాదు. ప్రతీ దినము జపములో దశాంశహోమము చేయవచ్చు. లేదా లక్ష పూర్తయిన పిమ్మట హోమం చేయవచ్చు.

వశ్య - పౌష్టిక కర్మలందు వాయవ్యముఖముగా త్రికోణ కుండము లేదా వృత్తకుండము నేర్పరిచి పాలు - నేయి - తేనెలతో హోమం చేయాలి.

ఆకర్షణలో లవంగములు - మారేడుపండ్లు - జాజి - ప్రియంగు - మోదుగులతో హోమం చేయాలి.

శ్లో॥ లవంగైకేన వా కుర్యాత్ తిర్యంగ్ వోదంగ్ముఖస్థితః
కాయైః సమస్తతంత్రోక్తస్తధా వరాట బీజకైః ।
విద్వేషే జుహుయాన్మంత్రీ రాక్షసీ దిక్ కృతాననః
ఔదుంబర వటాశ్వత్థ ప్లక్ష బీజైర్ఘృతాప్లుతైః ।
ఉచ్చాటనే మత్స్యకుండే జుహుయాత్ పావకాననః
అజాసర్పిశ్చ తత్క్షీరం బీజం కార్పాస సంభవం ।
దగ్ధాస్థినరమాంసంచ ..............
......................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మరొక విధముగా, అనగా ఉత్తరాభిముఖుడై కేవలం లవంగములతోనే, లేదా తామర బీజముల తోనూ హోమం చేయవచ్చు. విద్వేషణ కర్మయందు నైరుతి ముఖ ముగా హోమకుండము వద్ద కూర్చొని మేడి - రావి - మర్రి - ప్లక్ష బీజములతో హోమం చేయాలి.

ఉచ్చాటన కర్మయందు ఆగ్నేయముఖముగా కూర్చొని మత్స్యా కారముగా కుండము నేర్పరిచి, మేక నేయి, మేకపాలు, పత్తిగింజలు హోమం చేయాలి.

## హోమాంతమందు మంత్రసిద్ధి

శ్లో॥ పూజయిత్వాథ హుత్వాఽథ జప్త్వాధ్యాత్వాఽథదేవతాం
మృదుసోష్ణం సుపక్వంచ భుంజీయ లఘుభోజనమ్ ।
యద్వాతద్వా పరిత్యజ్య దుష్టానాం కుత్సితౌదనం
శతమన్నంతు ఖుంజీయాజ్జితాత్మాసిద్ధి భాగ్భవేత్ ।
అన్యథా భోజనే దోషః సిద్ధిహా నిశ్చజాయతే
ఇతి సర్వం శివేనోక్తం మంత్రాణాం సాధనం శుభమ్ ।
అనుష్ఠితో యథాన్యాయం యదిమంత్రో న సిధ్యతి
పునస్తావ దనుష్ఠేయం తతః సిద్ధో భవత్యలమ్ ।
పునస్త్యనుష్ఠితో మంత్రో యదిసిద్ధోన జాయతే
ఉపాయాస్త్రతికర్తవ్యాః సప్త శంకరభాషితాః ॥



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మంత్రసిద్ధి కొరకు నిర్దేశించిన ఆయా హోమ - జప - ధ్యానములు ఆచరించాలి. మృదువైన - వేడిగానున్న ఆహారమును సాధకుడు గ్రహించాలి. చద్దన్నము, చల్లారిన ఆహారపదార్థములు - పాపద్రవ్యముచే ఏర్పడిన ఆహారము గ్రహించరాదు.

ఆహారదోషమున్నచో మంత్రము సిద్ధింపదు. నియమాను సారముగా అనుష్ఠించిననూ మంత్రసిద్ధి కలుగనిచో, సాధకుడు మరల పునరనుష్ఠానము ప్రారంభించవలయును. రెండవ సారి కూడా సిద్ధి లభించినచో సప్త సంసారముల నాచరింప వలయును. ఇది శివునిచే చెప్పబడినది.

శ్లో॥ ద్రావణం బోధనం వశ్యం పీడనంశోష - పోషణం
దహనం తత్క్రమం కుర్వన్ మంత్రః సిద్ధో భవేత్ధృవమ్
ద్రావణంవారుణేబీజే గ్రధనం క్రమయోగతః
తన్మాంత్రాద్యంత మాలిఖ్య శిలాకర్పూరకుంకుమైః ।
ఉశీరరోచనాభ్యాం చ మంత్రం సంగ్రధితం లిఖేత్
క్షీరాజ్యతోయ మధుభిర్మధ్యే తం లిఖితం క్షిపేత్ ।
పూజనాజ్జపనాద్ధోమాత్ ద్రావితః సిద్ధిదోధృవం
ద్రావితోఽపి న సిద్ధశ్చేత్ బోధనం తస్యకారయేత్ ।
సారస్వతేన బీజేన సంపుటీ కృత్యసం జపేత్
ఏవంబుద్ధో భవేత్ సిద్ధో నోచేత్ తర్వివశీకురు ।
ఆరక్త చందనం కుష్ఠం హరిద్రామదనంశిలా

ఏతైస్తుమంత్రమాలిఖ్య భూర్జపత్రే సుశోభనే ।
ధార్యంకతేభవేత్ సిద్ధిః వశ్యమేతత్ ప్రకీర్తితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** తంత్రశాస్త్రమునందు సప్త సంస్కారములు చెప్పబడినవి. 1. ద్రావణం 2. బోధనం 3. వశీ కరణం 4. పీడనం 5. శోషణం 6. పోషణం 7. దహనం, వం బీజమును మంత్రాక్షరమునకు మాలవలె సంపుటము చేయుట ద్రావణమనబడును.

మంత్రమును మనశ్శిల - కర్పూరము - కుంకుమ పూల మిశ్రమముతో భూర్జపత్రముపై వ్రాయలి. మరల వట్టివేళ్ల రసం, గోరోచనం కలిపి వం బీజ గ్రథితముగా మంత్రమును భూర్జ పత్రముపై లిఖించాలి.

పాలు-నేయి - నీళ్లు - తేనె ఒక పాత్ర యందుంచి ముందుగా చెప్పినట్లు వ్రాసిన ఆ భూర్జపత్రమును ఇందుంచాలి. పిమ్మట పూజ - జప - హోమములు చేసిన సిద్ధించును. దీనినే ద్రావిత మందురు.

ద్రావణము చేసిననూ మంత్రము సిద్ధించనిచో, మంత్రమును "ఐం" బీజ సంపుటము చేసి జపించాలి. అపుడు మంత్రము ప్రబుద్ధ మగును. అయిననూ మంత్రసిద్ధి కలుగనిచో మంత్ర వశీకరణము నాచరించాలి.

ఎర్రచందనము - కుష్ఠము - పసుపు - మదనఫలము - మనశ్శిల మిశ్రమములతో భూర్జపత్రముపై మంత్రం లిఖించి, దానిని కంఠమునందు ధరించాలి. దీనినే వశీకరణమందురు.



శ్లో॥ అధరోత్తరయోగేన యధా తు పరిజప్యతే
విద్యామావిక దుగ్ధేతు లిఖిత్వా కచ్ఛ పాంఘ్రిణా ।
తధాభూతేన మంత్రేణ హోమఃకార్యోదినేదినే
పీడితోలజ్జాయావిష్టః సిద్ధః స్యాత్ నాథపోషయేత్ ।
నిత్యాయాఃత్రైపురం బీజం ఆద్యంతేతస్య యోజయేత్
గోక్షీరైర్మధునోల్లిఖ్య విద్యాంపాణౌ విధారయేత్ ।
పోషితోఽధ భవేత్సిద్ధో నో చేత్ కార్యస్య శోషణా
ద్వాభ్యాంద్వాభ్యాంచ బీజాభ్యాం మంత్రైః కుర్యాద్విదర్భణమ్ ।
ఏషావిద్యాగలేధార్య లిఖిత్వా వట భస్మనా
శోషితోఽపి న సిద్ధశ్చేత్ దహనీయోఽగ్నిబీజతః ।
ఆగ్నేయేన చ బీజేన మంత్రస్యైక మక్షరం
ఆద్యంతమధ ఊర్ధ్వంతు యోజయేత్ దాహకర్మణి।
బ్రహ్మవృక్షస్య తైలేన మంత్రమాలిఖ్య ధారయేత్
కంఠదేశే తతోమంత్ర సిద్ధిః స్యాచ్ఛంకరోదితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** వశీకరము చేసిననూ మంత్రము సిద్ధించనిచో, తాబేటియొక్క కాలి ఎముకను గొర్రి పాలతో తడిపి మంత్రమును పైన క్రింద లిఖించాలి. పిమ్మట ప్రతి దినమూ జపానంతరం హోమం చేయాలి. దీనినే పీడితం అంటారు.

పీడితమంత్రము సిగ్గుపడి సిద్ధినిచ్చును. అయిననూ మంత్రసిద్ధి లభించనిచో మంత్రం ఆద్యంతమూ, త్రిపురా మంత్రపుటితము చేసి, భూర్జపత్రముపై ఆవుపాలు - తేనెతో లిఖించి చేతికి తావీదులో ధరించాలి. దీనిని పోషితం అంటారు.

అయిననూ మంత్రసిద్ధి లభించనిచో మంత్రమును రెండు - రెండు అక్షరములుగా విడదీసి, వటభస్మముతో లిఖించి కంఠము నందు ధరించాలి. దీనిని శోషణం అంటారు. అయిననూ మంత్ర సిద్ధి లభించనిచో మంత్రము యొక్క ప్రథమాక్షరము పైన, అంతిమాక్షరము క్రింద "రం" బీజము బ్రహ్మవృక్ష తైలముతో లిఖించి కంఠమునందు ధరించాలి. దీనినే దహనమందురు. ఈ విధముగా చేసిన తప్పక మంత్రము సిద్ధించును.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే మంగళాచరణ*
*మంత్రసాధనాదివర్ణనం నామ ప్రథమ పటలమ్ ॥*

❊ ❊ ❊

# ద్వితీయ పటలం

## వశీకరణము

శ్లో॥ ఏకచిత్తస్థితో మంత్రీ మంత్రం జప్త్వాఽయుతద్వయం
తతఃక్షోభయతే లోకాన్ దర్శనాదేవ సాధకః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు స్థిరచిత్తముతో ఈ క్రింది మంత్రమును 20 వేలు జపించిన, వశీకరణ ప్రయత్న



ములు సిద్ధించును. ఇతని దర్శనమాత్రమున సర్వులూ అను కూలురగుదరు.

**మంత్రం**

**ఓం ఐం పురం క్షోభయ భగవతీ గంభీరయ బ్లూం స్వాహా ॥**

## సర్వలోక వశీకరణము

శ్లో॥ విదారీవరమూలంతు జలేన సహ ఘర్షయేత్ ।
విభూత్యాసంయుతో మంత్రీ తిలకంలోక వశ్యకృత్॥
పుష్యే పునర్నవామూలం రుద్రదంతీయ మూలికాం
యవ బీజం తథా బధ్వా కరే సప్తాభి మంత్రితః ।
పూజ్యోభవతి సర్వత్ర మంత్రశ్చాత్రైవ కథ్యతే
ఉద్ భ్రాంత పత్రం మంజిష్ఠాం కకుభం తగరం సమమ్ ।
ఖాద్యేపానే తథా స్పర్శే దత్తే వశ్యంభవత్యలం
సింహేమూలం హరేత్ పుష్యే కట్యాంబధ్వాజగత్ప్రియః ।
నిశికృష్ణచతుర్దశ్యాం మహానీలీం శ్మశానతః
ఉద్ధృత్య నరతైలేన హ్యాంజనేలోక వశ్యకృత్ ।
తన్మూలంస్వస్యశుక్రేణ హ్యాంజనేలోకవశ్యకృత్
తన్మూలంబంధయేద్ధస్తే సర్వలోకప్రియో భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** విదారి, వట జట (మర్రి ఊడ) జలమందు అరగదీసి దానిని విభూతిలో కలిపి, లలాటమందు తిలకముగా ధరించిన జనులందరూ అనుకూలురగుదురు.

పుష్యమీ నక్షత్రమునందు పునర్నవా మూలమును, రుద్రదంతీ (రుదంతి?) మూలమును, యవగింజతో కలిపి ఓం ఐం పురం క్షోభయ భగవతీ గంభీరయ బ్లూం స్వాహా - అను మంత్రముతో సప్తవారములు (7 సార్లు) అభిమంత్రించి, చేతియందు ధరించిన, సర్వత్ర పూజనీయత పొందును. ఈ మంత్రము ముందుగా 20 వేలు జపించిన సిద్ధించును.

గాలికి ఎగిరివచ్చిన ఆకును, మంజిష్ఠ, అర్జునం తగరం (నంది వర్ధనం?) సమంగా కలిపి, సాధ్యవ్యక్తికి ఇచ్చినచో అతడు అనుకూలు డగును.

పుష్య నక్షత్రమునందు కంటకారిమూలము తెచ్చి కటియందు ధరించిన, అతడు అందరికీ ఇష్టుడగును. కృష్ణచతుర్దశి నిశిలో రుద్ర స్థానమునుండి మహానీలి మూలికతెచ్చి నరతైలము (?)తో వెలిగించి తయారుచేసిన అంజనము కళ్లకు పెట్టుకొనిన అందరికీ ఇష్టుడగును.

అదే మూలిక స్వవీర్యముతో కలిపి అంజనము చేసిన ధరించిననూ అందరికీ ఇష్టుడగును, ఆ మూలిక చేతికి ధరించిననూ జగద్ వశ్యమగును.

శ్లో॥ చంద్రేపుష్యే సముధ్ ధృత్య బ్రహ్మదండీయ మూలకం
భోజయేత్ సర్వసత్వానాం వశీకరణ మద్భుతమ్ ।
ఉలూక హృదయం తుల్యం కుమారీ రోచనేసుధీః
అంజనంలోచనే వశ్యమానయేద్ భువనత్రయమ్ ।



సర్వేషామేవ మంత్రాణాం మంత్రధ్యానం పృధక పృధక్
ఉక్తస్థానే యధాసంఖ్యామనుక్తేత్యయుతం జపేత్ ।
మృగశీర్షే తు సంగ్రాహ్యం సురక్త కరవీరకం
నవాంగులం కీలకంతు సప్తవారాభిమంత్రితమ్ ।
యస్యనామ్నాఖనేద్ భూమౌ సవశ్యో భవతిధ్రువమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పుష్యమీ నక్షత్రమందు చంద్రనాడీ సంచార కాలమున బ్రహ్మదండి మూలమున తెచ్చి సాధ్యవ్యక్తికి ఇచ్చిన అతడు అనుకూలుడగును. ఉలూక హృదయము, కలబంద, గోరోచనం సమానముగా గ్రహించి అంజనము తయారు చేసి ధరించిన జగద్ వశ్యమగును.

**ఇందులకు మంత్రము - ఓం నమో మహాయక్షిణి (అముకం) మే వశమానయ స్వాహా।**

ఈ మంత్రము ముందుగా 10 వేలు జపించిన సిద్ధించును. మంత్రములకు జపసంఖ్య చెప్పనిచోట పదివేలు జపించాలి.

మృగశిరా నక్షత్రమునందు తొమ్మిది అంగుళముల ఎర్రగన్నేరు మూలము తెచ్చి, ఓం ఐం స్వాహా అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి సాధ్యవ్యక్తి ఇంటిలో పాతినచో అతడు అనుకూలు డగును. ఈ మంత్రము ముందుగా పదివేలు జపించిన సిద్ధించును.

శ్లో॥ అపామార్గస్య కీలంతు మూలముత్సార్యత్ర్యంగులం
సప్తాభిమంత్రితంయస్య గృహేక్షిప్తం వశీభవేత్ ।

స్వయంభూకుసుమంవస్త్రే గృహీత్వాత్రిపథే దహేత్
శనేర్భౌమస్యవారేవా తద్భస్మ తిలకం కృతమ్ ।
రాత్రౌ కృష్ణచతుర్దశ్యాం లాంగలీమూల ముద్ధరేత్
శ్వేతచ్ఛ గలికా గర్భే శయ్యాయయా నరతైలకమ్ ।
క్షౌద్రతాళకసంయుక్తం తిలకం సర్వ వశ్యకృత్
అజామోదస్యములేన తురగీ గర్భశయ్యాయా ।
హరితాళం చ సంపిష్య గుటికా ముఖమధ్యగా
యద్ యస్మాత్ యా చతేవస్తు తత్తదేవదదత్యసౌ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అపామార్గమూలము మూడంగుళములు తెచ్చి, **ఓం మదనకామ దేవాయ ఫట్ స్వాహా** అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి ఇంటిలో పడవేసిన అతడు అనుకూలుడగును. ఈ మంత్రము 108 సార్లు జపించిన సిద్ధించును.

శనివారము లేదా మంగళవారమునందు స్త్రీరజో వస్త్రమును మూడు మార్గముల కూడలియందు దగ్ధము చేసి, ఆ భస్మము లలాటమునందు తిలకముగా ధరించిన, అధికార వశ్యమగును. తిలకధారణ మంత్ర మిట్లున్నది.

**ఓం నమో భైరవీ తరే ఆజ్ఞాకాలే కమలముఖే రాజమోహనే ప్రజావశీకరణే స్త్రీ పురుష రంజని లోకవశ్యమోహిని (అముకం) మే మోహయ గురుప్రసాదేన।**



కృష్ణపక్ష చతుర్దశియందు లాంగలీమూలము తెచ్చి తెల్ల ఆడమేక గర్భాశయమందు, నరతైలము - తేనె - హరితాళము కలిపి తిలకముగా ధరించిన జగద్వశ్యము సిద్ధించును.

అజామోదమూలము ఆడుగుర్రము యొక్క గర్భాశయముతో నూరి హరితాళము కలిపి గుటిక చేయాలి. ఇది నోటియందుంచు కొని సాధ్యవ్యక్తి నుండి ఇష్టవస్తు లాభము. ఇది సిద్ధించుటకు మంత్రము.

**ఓం అశ్వకర్ణేశ్వరి దుర్బలే ఆయికౌశిక జటాకలాపే ఢక్కారే ఫట్ కారిణి స్వాహా।** ఇది పదివేలు జపించిన సిద్ధించును.

వటపత్రం - మయూర శిఖామూలం నూరి తిలకంగా ధరించిన జగద్ వశ్యము సిద్ధించును.

శ్లో॥ విష్ణుక్రాంతాం భృంగరాజం రోచనం సహదేవికా
శ్వేతాపరాజితామూలం కన్యాహస్తే ప్రలేపయేత్ ।
వారిణా తిలకం కుర్యాత్ సర్వలోక వశంకరమ్
రక్తాశ్వమార పుష్పంచ కుష్ఠంచ శ్వేత సర్షపం ।
శ్వేతార్కమూలం తగరం శ్వేత సంజా చ వారుణీ
కృష్ణాష్టమ్యాం పుష్యయుక్తా చతుర్దశ్యాంతథావిధమ్।
పేషయేత్ కన్యకాహస్తే తిలకం సర్వవశ్యకృత్
అపామార్గస్య మూలంతు పేషయేద్రోచనేనతు ।
ఉలూక చక్షురాదాయ గోరోచన సమన్వితం
వారిణా సహదాతవ్యం పానాత్ వశ్యకరంపరమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** కృష్ణ అపరాజిత - భృంగరాజమూలము - గోరోచనము సహదేవి - శ్వేత అపరాజితా మూలము కన్యకా హస్తముచే నూరింప చేసి తిలకముగా ధరించిన జగద్ వశ్యమగును.

పుష్యమీ నక్షత్రము బహుళ అష్టమిరోజున, లేదా పుష్యమీ నక్షత్రము బహుళ చతుర్దశి (మాసశివరాత్రి) రోజున, ఎర్రగన్నేరు పూలు - కుష్ఠము - తెల్లఆవాలు - తెల్లజిల్లేడు మూలము - నందివర్ధన - తెలగురివింద - వారుణీమూలములు కన్యకచేత నూరించి తిలకముగా ధరించిన జగద్వశ్యము.

అపామార్గమూలము, గోరోచనముతో నూరి తిలకముగా ధరించిన లోకవశ్యము, ఇందుకు మంత్రము 1008 సార్లు జపించాలి.

**"ఓం నమో వరజాలినీ సర్వలోకవశంకరీ స్వాహా ॥**

ఉలూకచక్షువు, గోరోచనమందు మర్దనచేసి జలముతో సాధ్యవ్యక్తి అనుకూలుడగును.

శ్లో॥ ఉలూకస్య తు కర్ణాద్వా చటకస్య విలోచనం ।
తచ్చూర్ణం తిలకే తత్క్షణే గంధపుష్పయోః ।
క్షిపేద్ వామస్తకే యస్య స వశ్యో జాయతేఽచిరాత్
మాంసం గ్రాహ్యములూకస్య కంకుమాగురు చందనం
గోరోచనం సమంపిష్టం ..... ।



కృతోపవాసో గృహ్ణీయాద్ సమూలాంచేంద్ర వారుణీం
ఉత్తరాభిముఖే నైవ కుట్టయేద్ తదుదూఖలే ।
తత్కల్కం త్రికటూతుల్య మజామూత్రేణ పేషయేత్
ఛాయాశుష్కాంవటీంకుర్యాత్ సా వటీ రక్తచందనమ్
ధృష్ట్వాఽథ స్వాంగులీంలిప్త్వా తథా స్పృష్టే జగద్వశం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఉలూక నేత్రములు - చటక (?) నేత్రములు చూర్ణము చేసి తిలకముగా ధరించిన జగద్వశ్యమగును. దీనిని గంధపుష్పములతో కలిపి సాధ్యవ్యక్తి తలపై చల్లిననూ వశ్యమగును.

ఉలూకమాంసము, కుంకుమాగురు చందనములు, గోరోచనం సమంగా నూరి ................ । ఇందుకు మంత్రము 1000 సార్లు ఈ మంత్రము జపించాలి.

**ఓం హ్రీం హ్రీం హ్రాః క్షఃహ్రాః ఫట్ నమః ।**

ఒకరోజు ముందు ఉపవాసముండి పూర్వదిశగా వెళ్లు ఇంద్రవారుణిని సమూలముగా తెచ్చి, ఉత్తరముగా దానిని మర్ధించి, దానిని త్రికూటములతో (మరీచి - పిప్పళ్లు - శొంఠి) కలిపి మేక మూత్రములో కలిపి, నీడలో ఎండించి గుటిక చేయాలి. దానిని ఎర్ర చందనముతో గంధము తీసి వేలితో సాధ్యవ్యక్తికి లేపనము చేసిన, స్పర్శ మాత్రముచే వశ్యమగును.

ఇదే గుటిక దేవదారు - శ్వేత చందనములను సమాన భాగములు జలముతో నూరి, గంధలేపనము చేసినచో సాధ్య వశ్యమగును. దానిని గోరోచనముతో తిలకముగా ధరించిన జగద్ వశ్యమగును. ఇందుకు మంత్రము -

**ఓం నమః శచీ ఇంద్రాణీ సర్వ వశంకరీ సర్వార్ధ సాధినీ స్వాహా।** ఇది వెయ్యిసార్లు జపించిన సిద్ధించును.

శ్లో॥ కృష్ణపక్ష చతుర్దశ్యామష్టమ్యాం వా ఉపోషితః
బలిందత్వా సముద్ధృత్య సహదేవీం సుచూర్ణయేత్ ।
తాంబూలేన తు తచ్చూర్ణం యోజ్యం వశ్యకరం పరమ్
రోచనా సహదేవీభ్యాం తిలకో వశ్యకారకః ।
మనఃశిలాచ తన్మూలమంజయేత్ సర్వవశ్యకృత్
తాంబూలేనతు సప్తాహం సహదేవీం ప్రయోజయేత్
రాజావశ్యమవాప్నోతి సర్వలోకేషు కాకథా
శిరసా ధారయేత్ తచ్చ చూర్ణం సర్వత్ర వశ్యకృత్ ।
ముఖే క్షిప్త్వాథ తన్మూలం కట్యాం బధ్వా చ కామయేత్
యా నారీం సా భవేత్ వశ్యా మంత్రయోగేన నాన్యథా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** కృష్ణపక్ష చతుర్దశి లేదా అష్టమి రోజున ఉపవాసముండి, దేవతలకు నైవేద్యం చేసి, సహదేవి మూలము తెచ్చి చూర్ణము చేయాలి. దానిని సాధ్యవ్యక్తికి తాంబూలముతో ఇచ్చిన వశ్యమగును.



దానిని గోరోచనంతో కలిపి తిలకముగా ధరించిన అందరికీ ఇష్టుడగును. మనశ్శిల సహదేవీ మూలములు నూరి ధరించిననూ అందరూ అనుకూలురగుదురు. ఒక వారం రోజులు సహదేవీ చూర్ణము తాంబూలముతో ఇచ్చిన రాజవశ్యమగును. సహదేవీ చూర్ణము శిరస్సు యందు ధరించిననూ అందరూ అనుకూలు రగుదురు.

సహదేవీమూలము కటియందు ధరించి స్త్రీ సంగమము చేసి ఆ స్త్రీ గయ్యాళితనము తొలగును. ఇది సిద్ధించుటకు మంత్రము.

**ఓం నమో భగవతి మాతంగేశ్వరి సర్వముఖ రంజని సర్వేషాం మహామాయే మాతంగ కుమారికే లేపే లఘు లఘు వశం కురు కురు స్వాహా ॥** ఇది వెయ్యి జపించిన సిద్ధించును.

శ్లో॥ సునిర్వృత్త చితాంగారం శృగాల రుధిరైస్సహ
యస్యైవశిరసి క్షిప్తం సవశ్యో భవతి ధృవమ్ ।
శిఖిపిత్తంచ గోరంభా మోహినీ రోచనా శిఖా
పేషయేత్ కన్యకా హస్తాత్ స్పర్శేపానే జగద్వశమ్ ।
శ్వేతాపరాజితామూలం చంద్రగ్రహణ ఉద్ ధృతం
అంజితాక్షో నరస్తేన తిలకో లోక వశ్యకృత్ ।
మేఘనాదస్య మూలస్తు వక్త్రస్థం వశ్యకారకం
ప్రతివాదీ భవేన్మూకో౽ధవాయాతి ..... ।
గ్రాహ్యం కృష్ణచతుర్దశ్యాం శ్వేత గుంజీయమూలకం
తాంబూలేన ప్రదాతవ్యం సర్వలోక వశంకరమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శ్మశానంలో ఆరిన చితా భస్మం, అంగారములు, శృగాల రుధిరము కలిపి సాధ్యవ్యక్తి శిరస్సుపై చల్లిన అతడు అనుకూలుడదును.

నెమలి పిత్తము - గోరంభ - సంపెంగ - గోరోచనం కన్యా హస్తముచే నూరించి, సాధ్యవ్యక్తికి స్పర్శచేసిన అతడు వశమగును.

చంద్రగ్రహణకాలమందు తెల్ల అపరాజితామూలం తెచ్చి అంజనం తయారుచేసి తిలకంగా ధరించిన జగద్ వశ్యమగును. మనశ్శిల గోరోచనం - తెల్లగురివింద మూలము నీటితో నూరి తిలకముగా ధరించిన సాధ్యవ్యక్తితో సంభాషించిన అతడు అనుకూలుడగును.

మేఘనాదమూలము నోటియందుంచుకొని సంభాషించిన అందరూ అనుకూలమగుదురు. ప్రతివాది వాదమునందు పరాజయము పొందును. బహుళ చతుర్దశి (మాసశివరాత్రి)యందు తెల్లగురివింద మూలము తెచ్చి సాధ్యవ్యక్తికి తాంబూలముతో ఇచ్చిన అనుకూలుడగును.

శ్లో॥ స్వర్ణవేష్టిత తన్మూలం సముద్రం కారయేద్ బుధః
తద్వాక్యాత్ వశమాయాతి ప్రాణైరపి ధనైరపి ।
చర్వయిత్వా తు తన్మూలం తేనైవ తిలకం కృతం
దృష్టమాత్రే వశంయాతి నారీ వాపురుషోఽపివా ।
కృతోపవాసో మంత్రీతు పుష్యేకృష్ణాష్టమీయుతే



పుష్పధూప బలిందత్వా ఘృతేనైవ తు దీపయేత్ ।
దత్వామంత్రం జపేత్త్రత హ్యష్టాధిక సహస్రకం
శ్వేతగుంజాఫలం గ్రాహ్యం తత్ స్థానాత్ మృత్తికాయుతమ్ ।
ఘృతేన లేపయేత్సర్వం నవపాత్రేతు శోభనే
క్షిప్త్వా కృష్ణచతుర్దశ్యామష్టమ్యాం భువి నిక్షిపేత్ ।
సమంత్రేణోదకేనైవ సించేన్నిత్యం ఫలావధి

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అదే తెల్లగురివిందమును బంగారు రేకులో నుంచి అంగులీయకముగా ధరించిననూ చాలా మంచిది. దాని చూర్ణము తిలకముగా ధరించిన, దృష్టమాత్రము చేతను అనగా సాధ్యవ్యక్తిని చూచిన మాత్రముననే అనుకూలుడగును. ఇందుకు సిద్ధించవలసిన మంత్రము ఇట్లున్నది.

**ఓం వజ్రకరిణే శివే రక్ష రక్ష భగవతీ మమాది అమృతం కురు కురు స్వాహా ॥**

సాధకుడు ఒకరోజు ముందుగా ఉపవాసముండి, మరుసటి రోజు పుష్యమీ నక్షత్రయుక్త బహుళ అష్టమిరోజున పంచోపచారములు చేసి ఘృతదీపమును దానం చేయాలి. పిమ్మట ఈ క్రింది మంత్రమును 1008సార్లు జపించాలి.

**ఓం శ్వేతవర్ణే సితపర్వతవాసిని అప్రతిహతే మమకార్యం కురు కురు ఠః స్వాహా ।**

శ్వేతగుంజాఫలము తీసుకొని మట్టి, నెయ్యితో లేపనము చేసి, దానిని నూతన పాత్రలోనుంచి బహుల చతుర్దశి (మాసశివరాత్రి) లేదా బహుళ అష్టమిరోజున భూమిలో పాతాలి. అందునుండి ఫలము (గింజ) వచ్చు వరకు ఈ క్రింది మంత్రము జపించుచూ నిత్యమూ దానికి నీళ్లు పోయాలి.

**ఓం శ్వేతవర్ణే సితవాసిని శ్వేపర్వతవాసిని, సర్వకార్యాణి కురు కురు అప్రతిహతే నమో నమః స్వాహా ॥**

ఆ మొక్కకు గింజ వచ్చినరోజున ఉపవాసముండి పుష్యమీ బహుళ అష్టమి రోజున పవిత్రముగా దానికి (ఆ మొక్కకు) పంచోపచారపూజ చేసి, ఈ క్రింది మంత్రములతో అంగన్యాస మాచరించాలి.

**ఓం శ్వేతే హృదయాయ నమః**
**ఓం పద్మముఖే శిరసే స్వాహా ।**
**ఓం నమః సర్వజ్ఞానమయే శిఖాయైవషట్ ।**
**ఓం నమః సర్వశక్తిమయే కవచాయ హుమ్ ।**
**ఓం నమో నేత్రత్రయాయ వౌషట్ ।**
**ఓం పరమంత్ర భేదేన అస్త్రాయ ఫట్ ।**

పిమ్మట – "**ఓం నమో భగవతి హ్రీం శ్వేత వాసే నమో నమః స్వాహా**" అని ఆ మొక్కను పెళ్లగించాలి. ఈ మంత్రము ప్రయోగించుటకు ముందు 10 వేలు జపించి దశాంశ హోమము నేయి – తిలలతో దూర్వలతో ఆచరించాలి.



ఈ విధముగా సుసిద్ధమైన ఆ శ్వేతగురివిందమూలము శ్వేతచందనముతో నూరి ధరించిన సర్వవశ్యమగును. ఈ మూలమును తేనెతో నూరి తిలకముగా ధరించిననూ జగద్ వశ్యమగును. అతని మాటకు ఎదురు చెప్పువారుండరు.

దీనినే మనశ్శిల, శ్వేతచందనంతో నూరి తిలకముగా ధరించిన జగద్ వశ్యమగును. తెల్లఆవాలు, ప్రియంగు సమానముగా గ్రహించి, ఆ శ్వేత గుంజామూలముతో కలిపి నూరి ఆ చూర్ణమును సాధ్యవ్యక్తి శిరస్సుపై చల్లినచో అతడు అనుకూలుడగును. ఈ అన్ని ప్రక్రియలందూ తిలకముగా ధరించిననూ, అంగలేపనము చేసు కొనిననూ కార్యము సిద్ధించును. అది ధరించుటకు ముందు ఈ క్రింది మంత్రమును 108 సార్లు జపించి దానిని అభిమంత్రించ వలయును.

**ఓం నమః శ్వేత గాత్రే సర్వలోకవశంకరి దుష్టాన్ వశం కురు కురు మే వశమానయ స్వాహా ॥**

శ్లో॥ వసామూలం ప్రియంగుచ కుష్ఠైలాం నాగకేశరం
శ్వేతసర్షప సంయుక్తో ధూపః సర్వవశంకరః ।
కందరాధో జపేల్లక్షద్వయం మంత్రస్యసాధకః
ఘృతాక్తైః గుగ్గులైః హోమైర్దేవీ సౌభాగ్యదాయినీ ।
త్రైలోక్యం వశమాయంతి స్పృష్టమాత్రే న సంశయః
యక్ష మంత్రేణ సంతాడ్య సప్తధా క్షీరభూరుహమ్ ।

తత్కాష్ఠం చైవ సంగ్రాహ్యమేక వింశతి మంత్రితం
ధారయేత్ దక్షిణే కర్ణే హ్యన్నమప్రార్థితం లభేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** వసమూలం – ప్రియంగు – కుష్ఠం – ఏలకి – నాగకేసరం తెల్లఆవాల మిశ్రమాన్ని ఈ క్రింది మంత్రంతో 100 సార్లు అభిమంత్రించి ధూపం వేసిన సర్వ వశమగును.

**ఓం కామినీ మాధవీ మాధవీ నమః**

ఓం ఘంటాకర్ణాయ నమః అను మంత్రముతో ఒక శిలను అభిమంత్రించి నూతన నగరమందు పడవేసిన, ఆ నగరమందు తాను అనుకున్నది సిద్ధించును. మంత్రసిద్ధికి ముందుగా ఈ మంత్రమును పదివేలు జపించాలి.

ఏకాంతప్రదేశమందు – లేదా గుహలో కూర్చొని **ఓం క్లీం జనకే స్వాహా** – అను మంత్రమును 2 లక్షలు జపించిన పిమ్మట, ఘృతము – గుగ్గిలములతో 20వేలు హోమం చేసిన, స్పర్శమాత్రముచేతనే సాధ్యవ్యక్తి వశమగును.

క్షీరవృక్షమును ఈ క్రింది మంత్రముతో 7 సార్లు తాడనము చేసి దాని శాఖతో 21 సార్లు మరల అభిమంత్రించి, ఆ కాష్ఠ ఖండమును, చెవికి లేదా శరీరమున ధరించిన అయాచితముగా భోజనసిద్ధి కలుగును.

**ఓం మహాయక్ష సేనాధిపతయే మణిభద్రాయ అప్రార్థితమన్నం దేహి మే దేహి స్వాహా ॥**



శ్లో॥ అశ్వత్థ వృక్షమారూఢః పూర్వమేవాయుతంజపేత్
కరవీరక పుష్పంచ సప్తమంత్రాభి మంత్రితమ్ ।
తత్పుష్పం దీయతే యస్య సవశ్యస్తత్ క్షణాత్ భవేత్ ।
వాసోపిధాయ కౌసుంభం రాత్రా మంత్రాయుతం జేపత్
నరనారీ నరేంద్రాణాం సతతం క్షోభకారకః ।
రాత్రౌదశసహస్రాణి జప్త్వాఽథ పద్మకేసరైః
సితామధుపయోమిశ్రైః కృతహోమో దశాంశతః ।
రంజకశ్చేష్టతే లోకాన్ దర్శనేతృప్తికారకః
భుక్త్వోచ్ఛిష్టో భవేన్మంత్రీ పూర్వమేవాయుతం తతః ।
ఏకాంతే స్మరణాన్మంత్రీ తత్రై వాయంతి భోజనమ్
మంత్రం లక్షమిమం జప్త్వా భూతనాథః ప్రసీదతి ।
ఖభూపాతాలభూతాని స్మరణాత్ కురుతే వశమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అశ్వత్థవృక్షము నధిరోహించి **"ఓం నమో భగవతే రుద్రాయ సిద్ధరూపిణే శిఖిబంధ సర్వేషాం శివమస్తు శివమస్తు హనహన రక్ష రక్ష సర్వభూతేభ్యశ్చ నమః॥** అను మంత్రము పదివేలు జపించి సిద్ధి పొందాలి.

పిమ్మట ఆ సిద్ధమంత్రముతో గన్నేరుపూవును 7 సార్లు అభిమంత్రించి సాధ్యవ్యక్తికి ఇచ్చినచో వారు అనుకూలురగుదురు.

కుసుంభపూలచే రంజితమైన వస్త్రము ధరించి **"ఓం నమో భూతనాధాయ యద్ భూపాలం వశంకురుకురు భువనక్షోభక**

**సర్వలోకాన్ క్షోభయ క్షోభయ స్ఫేంబ్లిం బ్లిం బ్లూం స్వాహా ॥** అను మంత్రము పదివేలు జపించినచో తాను తలచుకొన్న వ్యక్తి అనుకూలుడగును.

రాత్రియందు - **ఓం ఐం అముకం వశం కురు హ్రీం స్వాహా।** అను మంత్రము పదివేలు జపించి అముక అను స్థానములో సాధ్య వ్యక్తి నామముచ్చరించాలి, చక్కెర, తేనె, పాలతో పద్మకేసరములు వెయ్యిసార్లు హోమం చేసిన సాధ్యవ్యక్తి అనుకూలుడగును.

భోజనము చేసిన అనంతరము నోరు శుభ్రము చేసుకొనకుండా ఈ క్రిమంది మంత్రమును, ఉచ్ఛిష్టముఖముతో, లేదా నోటిలో ఏదైనా పొక్కచెక్క, తాంబూలం వంటిది ఉంచుకొని మంత్రమును 10 వేలు జపించిన సిద్ధించును.

**"ఓం ఉచ్ఛిష్టచాండాలీ వాగ్వాదినీ రాజమోహినీ ప్రజా మోహేన స్త్రీ మోహన ఆన్ ఆన్ వేవే వాయువాయు ఉచ్ఛిష్ట చాండాలీ సత్యవాదినీ శక్తిపురై ॥**

పిమ్మట మంత్రము సిద్ధించినచో సాధకునికి స్మరణ మాత్రము చేత ఇష్టసిద్ధి కలుగును.

**"ఓం నమో భూతనాధాయ సమస్త భువనే భూతాని సాధయ"** - అను మంత్రమును ఒక లక్ష జపముచేసి సిద్ధి పొందవలయును. సాధకునికి ఇష్టసిద్ధి కలుగును.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే సర్వవశీకరణం నామ
ద్వితీయం పటలమ్

❊ ❊ ❊



# తృతీయం పటలమ్

## అథ రాజవశ్యమాహ

శ్లో॥ కుంకుమం చందనం చైవ రోచనం శశిమిశ్రితం
గవాంక్షీరేణ తిలకం రాజవశ్యకరం పరమ్ ।
చక్రమర్దస్య మూలంతు హస్తరక్షే తు సముద్ధరేత్
రాజద్వారే భవేత్పూజ్యో హస్తేబద్ధా చ వాదజిత్ ।
రాజద్వారే భవేత్ పూజ్యో హస్తేబద్ధా చ వాదజిత్ ।
మంజిష్ఠా కుంకుమంచైవ హ్యజమోదా కుమారికా
చితి భస్మస్వరక్తంతు స్వరే తసా చమారయేత్ ।
పుష్యేచ వటికాం కృత్వా ఖాద్యేపానేచ దాపయేత్
పుష్యేచ వటికాం కృత్వా ఖాద్యేపానే చ దాపయేత్
స్పృష్టేవా రాజవశ్యం స్యాచ్ఛండమంత్ర ప్రభావతః ।
శ్వేతాపరాజితామూలం చంద్రగ్రహణ ఉద్ధృతం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇపుడు అధికారుల వశీకరణము చెప్పబడుచున్నది. కుంకుమపువ్వు - చందనం - గోరోచనం - కర్పూరములు మిశ్రమం చేసి **ఓం క్లీం సం (అముకం) మే వశం కురు కురు స్వాహా** అని వెయ్యిసార్లు జపసిద్ధి పొందిన పిమ్మట ఏడుసార్లు అభిమంత్రించి తిలకముగా ధరించిన అధికారులు అనుకూలురగుదురు.

హస్తా నక్షత్రమునందు చక్రమర్ద మూలము తెచ్చి ఓం సుదర్శనాయ హుంఫట్ స్వాహా అను మంత్రముతో అభిమంత్రించి చేతికి ధరించిన ప్రభుత్వ కార్యములు త్వరగా నెరవేరును. ఈ మంత్రము ముందుగా పదివేలు జపించిన సిద్ధించును.

ఓం హ్రీం రక్తచాముండే రక్తం కురు కురు (అముకం) మే వశమానయ స్వాహా.

ఇది చండ మంత్రము ఇది పదివేలు జపించిన సిద్ధించును. పిమ్మట మంజిష్ఠ – కుంకుమపువ్వు – అజమోద కలబంద – చితా భస్మము – స్వ అనామికా రక్తము, సవీర్యములతో మిశ్రమం చేసి పుష్యమీ నక్షత్రం రోజున గుటిక చేయాలి. దీనిని సాధ్యవ్యక్తికి స్పర్శ మాత్రముననే అతడు అనుకూలుడగును.

చంద్రగ్రహణ సమయమున తెల్ల అపరాజితామూలము తెచ్చి చూర్ణముచేసి చండమంత్రముతో అభిమంత్రించి సాధ్యవ్యక్తికి ఇచ్చిన అనుకూలుడగును.

## బదనికలు

ఉత్తరానక్షత్రమందున, లేదా ఉత్తరాషాఢ – ఉత్తరాభాద్ర నక్షత్రమందున రావి బదనిక తెచ్చి చండమంత్రముతో అభిమంత్రించి చేతికి ధరించిన కార్యసిద్ధి కలుగును.

భరణీ నక్షత్రమందున ఉసిరిబదనిక – విశాఖా నక్షత్రము రోజున మామిడి బదనిక, పుబ్బా నక్షత్రమందున దానిమ్మ బదనిక, చండీ మంత్రముతో అభిమంత్రించి ధరించిన అధికారులు వశమగుదురు.



ఆశ్లేషా నక్షత్రముందున నాగకేసర బదనిక – సమంత్రకముగా ధరించిన ఎంతటి గొప్పవారైనా వశులగుదురు.

శ్లో॥ నిఘృష్యాంకోల తైలేన రక్తమండలమూలకం
సప్తాభిమంత్రితం కృత్వా తిలకం రాజవశ్యకృత్ ।
హోమయేత్ కటుతైలేన రక్తచందన రాజికం
సహస్రాహుతి మాత్రేణ రాజానం వశమానయేత్ ।
సర్షపం ఛాగరక్తేన హుత్వా రాత్రౌ స్వకేగృహే
సంఖ్యాచ పూర్వవత్ వశ్యో రాజాభవతి నాన్యధా ।

**సంపత్కుర్‌ తెలుగు వ్యాఖ్యానం :-** అంకోల తైలముతో, రక్త మండల మూలము మర్దించి తిలకముగా ధరించిన అధికారులు అనుకూలురగుదురు. చండమంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి ధరించాలి.

కటుతైలముతో ఎర్రచందనం – తెల్ల ఆవాలు మర్దించి చండ మంత్రముతో వెయ్యిసార్లు అభిమంత్రించి తిలకముగా ధరించిన అధికారులు వశమగుదురు.

రాత్రియందు స్వగృహమందు తెల్లఆవాలు, మేక రక్తము చండ మంత్రముతో హోమము చేసిన అధికారులు వశమగుదురు.

## పరవాది జయం

శ్లో॥ గోజిహ్వా శిఖిమూలం వా ముఖే శిరసి సంస్థితా
కురుతే సర్వవాదేషు జయంపుష్యే సముద్ ధృతా ।

మార్గశీర్షే తు పూర్ణాయాం శిఖిమూలం సముద్ధరేత్
బాహౌ శిరసి వా ధార్యం వివాదే విజయో భవేత్ ।
బంధనాత్ ముచ్యతేతేన శిఖాబంధేన సంశయః
మేఘనాదస్యమూలంతు వక్త్రస్థంతారవేష్టితమ్ ।
పరవాదీ భవేన్మూలోऽథవా యాతి ......
నిశి కృష్ణచతుర్దశ్యాం మహానీలీం శ్మశానతః ।
ఆదాయ బంధయేద్ధస్తే వివాదే విజయో భవేత్
శ్వేత గుంజాన్వితం మూలం ముఖస్థం దుష్టతుండజిత్ ।
త్రిసంధ్యంత్రిదిన న్యస్తం యస్యమూర్ధ్ని కరస్థితం
భస్మచటక నాశోత్థం సజయం లభతే నరః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శుక్లపక్షములో పుష్యమీ నక్షత్రమందు గోజిహ్వా మూలము, మయూరశిఖి మూలము తెచ్చి అభిమంత్రించి ధరించిన కోర్టు వివాదములందు జయము కలుగును.

ఈ అన్ని ప్రయోగములకు ముందుగా చండమంత్రము పది వేలసార్లు జపించి సిద్ధి పొందవలయును.

మార్గశిరమాసమందు పున్నమియందు, మయూరశిఖి మూలము తెచ్చి ధరించిననూ వాదజయము కల్గును. మేఘనాద మూలికను వెండితావీదులో పెట్టి ధరించిన వివాద జయము కల్గును.

మాసశివరాత్రి రాత్రియందు శ్మశానమునుండి నల్ల అపరాజిత మూలిక సమంత్రకముగా తెచ్చి, చేతికి ధరించిన వాదజయము



సిద్ధించును. అదే విధముగా శ్వేతగుంజామూలము కూడా కార్యసిద్ధి కలిగించును.

తెల్లపిచిక భస్మము ఈ క్రింది మంత్రముతో అభిమంత్రించి శిరస్సుపై మూడురోజులు సంధ్యాకాలమున ధరించిన వివాద జయము కలుగును.

**ఓం నమో భస్మిజయ ధూళి ధూసరి అరరణిజయ వాగ్ బంధయతు స్వాహా ॥**

## దుష్టులపై విజయం

శ్లో॥ శుక్లపక్షయతే పుష్యే సంజామూలం సముద్ధరేత్
బద్ధంశిరసి శయ్యాయాం చేరబాధా హరంపరమ్ ।
ధాత్ర్యాస్తు బ్రధ్నకం గ్రాహ్య మాశ్లేషాయాం ప్రయత్నతః
హస్తే బద్ధం భయంహస్తి చౌరవ్యాఘ్రాణి రాజకమ్ ।
ఆర్ద్రాయామాహృతం వంశబ్రధ్నకం కర్ణధారితరి
విజయం ప్రాపయేత్ యుద్ధే శత్రుమధ్యే న సంశయః
అంకోలతైల సంభిన్నం కుర్యాతామ్రత చూర్ణకం
అన్యేస్పృష్టమాత్రేణ మహాహస్తీ వశోభవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శుక్లపక్షంలో పుష్యమీ నక్షత్రమందు శ్వేతగుంజామూలము ధరించిననూ, శయ్యయందుంచిననూ గృహమందు దొంగల భయం ఉండదు.

ఆశ్లేషా నక్షత్రమందు ఉసిరిబదనిక తెచ్చి, చేతికి ధరించిన వ్యాఘ్ర - హస్తి - చోర - ప్రభుత్వాధికారుల భయము, బాధ కలుగవు.

ఆర్ద్రా నక్షత్రమునందు వెదురుబదనిక తెచ్చి చెవికి, లేదా చేతికి ధరించిన యుద్ధమందు జయము కలుగును.

అంకోల తైలముతో మామిడి చూర్ణము కలిపి, దానితో చేతికి లేపనము చేసుకొని, ఏనుగును స్పర్శ చేసిన అది వశమగును.

శ్లో॥ గృహీత్వా హస్తనక్షత్రే చూర్ణయిత్వా ఛుఛుందరీం
తల్లేపేన గజాయాంతి దూరతో నతమస్తకాః ।
బిల్వపుష్పస్య చూర్ణంతు ఛుఛుందర్యాశ్చతత్సమం
తల్లిప్యాంగం నరందృష్ట్వా దూరేగచ్ఛంతి కుంజరాః ।
మూలం మర్కట వల్యాశ్చ బాహోర్బద్ధం చ మూర్ధని
దుష్టదంతి భయం న స్యాత్ యుద్ధాదిభయనాశనమ్।
శ్వేతాపరాజితా మూలం హస్తస్థం వారయేద్గజాన్
శ్వేతంబృహతి మూలం చ హస్తస్థం వ్యాఘ్రభీతినుత్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** హస్తా నక్షత్రమందు ఛుఛుందరిని ( ) చూర్ణముచేసి, దానిని లేపనము చేసికొన్నచో గజములు దూరముగా పోవును.

బిల్వఫల చూర్ణము, ఛుఛుందరీ చూర్ణము సమముగా గ్రహించి లేపనము చేసుకొన్ననూ గజబాధ ఉండదు. మర్కటవల్లరి



(అపామార్గము) మూలము, చేతికి ధరించినచో దుష్టగజముల బాధ కలుగదు, యుద్ధభయము తొలగును.

శ్వేతాపరాజితా మూలము చేతికి ధరించిన గజబాధ కలుగదు. శ్వేతబృహతి (కంటకారి?) మూలము చేతికి ధరించిన వ్యాఘ్ర భయము కలుగదు.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే రాజవశీకరణ*
*వివాద జయలాభో నామ తృతీయం పటలమ్ ॥*

* * *

# చతుర్థం పటలమ్

## సర్వజన వశీకరణమ్

శ్లో॥ గృహీత్వా వటమూలంచ జలేన సహ ఘర్షయేత్
విభూత్యా సంయుతం భాలే తిలకం సర్వ వశ్యకృత్।
బిల్వపత్రం గృహీత్వాతు ఛాయాశుష్కంతు కారయేత్
కపిలాదుగ్ధసార్ధేన వటీం కృత్వా తు గోలకమ్ ।
ఏభిస్తు తిలకం కృత్వా మోహనం సర్వతో జగత్
శ్వేత గుంజారసం పేష్యం బ్రహ్మదండీయమూలకమ్।
లేపమాత్రే శరీరాణాం మోహనం సర్వతో జగత్
మనః శిలా చ కర్పూరం పేషయేత్ కదళీరసే ।
అనేనైవతు తంత్రేణ తిలకం లోక మోహనమ్

గృహీత్వాతులసీ పత్రం రౌద్రే శుష్కంతు కారయేత్।
అశ్వగంధసమాయుక్తం విజయాబీజ సంయుతం
కపిలాదుగ్ధసార్ధేన వటీ రక్తి ప్రమాణతః ।
తద్భుక్త్వా ప్రాతరుత్థాయ మోహయేత్ సర్వతోజగత్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** వటమూలము జలముతో నూరి, విభూతితో దానిని కలిపి లలాటమందు ధరించిన సర్వజన వశమగును. బిల్వపత్రములను నీడలో ఎండించి, చూర్ణంచేసి, కపిల గోక్షీరముతో కలిపి గుటిక చేయాలి. దానిని తికలముగా ధరించిన మోహనకరముగా నుండును.

శ్వేతగుంజారసము, బ్రహ్మదండి మూలముతో నూరి, శరీర మందు లేపనము చేసుకొన్నచో సర్వమోహనమగును. కదలీరసముతో మనశ్శిల, కర్పూరం నూరి, దానిని తిలకముగా ధరించిన సర్వజన వశీకరమగును.

తులసి ఆకులను నీడలో ఎండించి, దానియందు గంజాయి – అశ్వగంధలతో నూరి, కపిల గోక్షీరముతో కలిపి మరల నూరి గుటిక చేయాలి. ప్రాతఃకాలమున ఒక గుటిక ఒక రత్తి ప్రమాణలో సేవించిన లోకమోహనమగును.

శ్లో॥ సింధూరం కుంకుమంచైవ గోరోచన సమన్వితం ।
ధాత్రీరససమాయుక్తం తిలకం లోకమోహనమ్ ॥



నాగ పుష్పం ప్రియంగుం చ తగరం పద్మకేసరం
జటామాంసీ సమం నీత్వా చూర్ణయేత్ మంత్రవిత్తమః
స్వాంగంతు ధూపయేత్తేన భజంతే కామవత్ ప్రియే
కన్యాగృహం శాలకాష్ఠం క్షిపేదేకాదశాంగుళం ।
బుక్షే చ పూర్వఫల్గున్యాం యస్త్రాం కన్యాం ప్రయచ్ఛతి
బ్రహ్మదండీ వచాకుష్ఠచూర్ణం తాంబూలైస్సహ దాపయేత్।
రవివారే కృతేయోగః సర్వలోకవశంకరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** గోరోచనం – కుంకుమ పువ్వు సింధూరం – ఉసిరిరసంలో కలిపి తిలకముగా ధరించిన మోహనకరముగా నుండును. నాగకేసరములు ప్రియంగు – నందివర్ధనం – పద్మకేసరములు – జటామాంసి – సమాన భాగములుగా కలిపి చూర్ణముచేసి దానిని, తన శరీరమునకు ధూపముగా వేసుకొనిన, దర్శనమాత్రముచే మోహితులగుదురు.

పూర్వఫల్గుణీ నక్షత్రమందు 11 అంగుళముల శాలకాష్ఠము (?), సాధ్యస్త్రీ యొక్క గృహమునందు పడవేసినచో ఆమె అనుకూలవతియతి యగును.

బ్రహ్మదండి–వచ–కుష్ఠములు చూర్ణము చేసి, తాంబూలము నందు కొద్దిమాత్రమున కలిపి ఇచ్చినచో సాధ్యవ్యక్తి అనుకూలముగా నుండును.

శ్లో॥ తాళం చ తులసీపత్రం కపిలాదుగ్ధ పేషితం
అనేన తిలకం భాలే సర్వలోకవశంకరమ్ ।
శ్వేతదూర్వాం గృహీత్వాతు కపిలాదుగ్ధ పేషితం
లేపమాత్రే శరీరాణాం సర్వలోక వశంకరః ।
బిల్వపత్రాణి సంగృహ్య మాతులుంగం తథైవ చ
అజాదుగ్ధేన సంపేష్య తిలకం లోక వశ్యకృత్ ।
శ్వేతార్కం రోచనాయుక్త మాత్మమూత్రేణ పేషితం
లలాటే తిలకం కృత్వా త్రైలోక్యం క్షోభయేత్ క్షణాత్
దృష్టిమాత్రేణ తేనైవ సర్వేభవంతి కింకరాః
తత్రపిష్టే న తాలేన క్షిపేత్ పుత్తలికాకృతమ్ ।
తామాఘ్రాయ గృహాద్ యాంతి మక్షికా నాత్ర సంశయః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** హరితాళం - తులసీ పత్రములు – కపిలగోక్షీరముతో నూరి తిలకముగా ధరించిన సర్వులూ అనుకూలు రగుదురు. శ్వేత దూర్వలు, కపిలగోక్షీరముతో నూరి శరీరమునకు లేపనము చేసుకొనిన సర్వులూ మోహనమగుదురు.

బిల్వపత్రములు - మాదీఫలము - మేకపాలతో నూరి తిలకముగా ధరించిన సర్వజనమూ అనుకూలురగుదురు. తెల్లజిల్లేడు, గోరోచనము కలిపి స్వమూత్రముతో నూరి, తిలకముగా ధరించిన దర్శనమాత్రము చేతనే వశులగుదురు.



## ఈగలు రాకుండా........

**మజ్జిగ - హరితాళము కలిపి ఒక బొమ్మగా చేసి గృహము నందుంచిన, ఆ వాసనకు ఈగలు రావు.**

శ్లో॥ శ్వేతార్కదుగ్ధం మాషం చ తిలచూర్ణ సమన్వితం
అర్కపత్రేషు విన్యస్తం మూషికాంతకరం గృహే ॥
తాలకం ఛాగవిణ్మూత్రం పేషితం చ పలాండునా
ఆలిప్యమూషికం తేన సజీవంతు విసర్జయేత్ ।
తందృష్ట్వా చ గృహం త్యక్త్వా పలాయంతే హి మూషికాః
మార్జారస్యమలంతాళం పిష్ట్వా మూషిక మాలిపేత్ ।
తమాఘ్రాయగృహం త్యక్త్వా సద్యోనిర్యాంతి మూషికాః
గంధకం హరితా బ్రాహ్మీం త్రికటుకం సమమ్ ।
రవౌ నృమూత్రే తత్ పిష్ట్వా లిప్తేమూషేతు పూర్వవత్
మూషకామూషికా దీపాల్లోధ్ర తైల సముద్భవాత్
గుడేన మిశ్రితాత్ సద్యః పలాయంతే గృహాత్ప్రియే॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** తెల్లజిల్లేడు ఆకులపై, తెల్లజిల్లేడుపాలు, మినుములు - తిలలు చూర్ణము కలిపి ఇంటి యందుంచినచో, ఇంటిలోని ఎలుకలు పారిపోవును. హరితాళం – మేకపెంటికలు, మేకమూత్రము ఉల్లిపాయతో కలిపి నూరి, ఒక ఎలుక శరీరమునకు పూసి, వదలివేసిన, దానిని చూసి దాని వాసనకు ఇంటిలోని ఎలుకలన్నీ ఇంటిని విడిచి వెళ్ళిపోవును.

హరితాళము – పిల్లిమలము కలిపి, ఎలుకకు పట్టించి అనగా లేపనము చేసి వదిలినచో ఇంటిలోని ఎలుకలన్నీ ఇల్లు వదలి పారి పోవును. గంధకము – హరితాళము – పిప్పళ్లు – శొంఠి – మిరియాలు నరమూత్రముతో నూరి ఎలుదేహమునకు పట్టించి, వదిలిననూ ఎలుకలన్నీ ఇల్లు వదలిపోవును. ఇది ఆదివారమునాడు చేయవలయును.

లోధ్రబీజ తైలము, బెల్లము కలిపి దీపము వెలిగించి ఈ క్రింది సాబర మంత్రము పఠించిన మూడుసార్లు చప్పట్లు చరిచిన ఇంటియందలి మూషకములు తొలగిపోవును.

**పూర్వేబ్రాహ్మైబంధః, పశ్చిమే విష్ణవే బంధః, ఉత్తరే రుద్రాయ బంధః, దక్షిణే యమాయ బంధః, పాతాళే వాసుకాయ బంధః, ఫణీ సహస్రాయ బంధః, హుం అంగుష్ఠాభ్యాం నమః ॥**

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే సర్వవశీకరణ
గృహక్లేశ నివారణో నామ చతుర్ధం పటలం

❋ ❋ ❋

# పంచమం పటలమ్

## అథమోహనమ్

శ్లో॥ చూర్ణంతు భావయేద్రక్తే మహిషీ కృష్ణసర్పయోః
కృష్ణధత్తూర పంచాంగం తద్ధూపో మోహకృత్నృణామ్
గుడంకరంజబీజం చ ఘూక చూర్ణేన సంయుతం



సమం పానేఽథవా ధూపే మోహం ప్రకురుతే నృణామ్ ।
హస్తిన్యాః పాదతలజం మహిష్యాః క్షురజం తథా
శుచినా సాధకేనాత్ర మలంగ్రాహ్యం ప్రయత్నతః ।
మయూరస్యఫలైః సార్ధం ధూమో హ్యత్యంత మోహకృత్
వృశ్చికోద్భవ చూర్ణేన ధూపోమోహకరో నృణామ్ ।
గరళం ధూర్త పంచాంగం మహిషీ శోణితం కణా
నిశాయాం కురుతే మోహం ధూపోగుగ్గుల సంయుతః
కుక్కుటాండ కపాలాని ఫలినా తాళకం వచా
కనకాగ్నియుతో ధూపః స్వస్థస్యావేశకారకః ।
తృణస్థిత జలౌకాయా విష్ఠా వాఽజగరోద్భవా
తచ్చూర్ణై ర్ధూపితా రాత్రౌ ముహ్యంతి ప్రాణినోధ్రువమ్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం:-** మోహనమనగా– మాదకత, కలిగించుట, ఆవేశము కలిగించుట అనబడును. ఈ శ్లోకములకు అర్థము చాలా జుగుప్సాకరముగా నుండుటచే వ్రాయుట లేదు. మోహనప్రయోగము బలహీనులకు ఒక్కొక్కసారి పిచ్చిని, లేదా మానసిక రోగము కలిగించు అవకాశము కలదు. ఈ పటలము నందు మొత్తం 17 శ్లోకములున్నవి.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే మోహనం నామ
పంచమ పటలమ్ ॥

❋ ❋ ❋

# షష్ఠం పటలమ్

## విద్వేషణమ్

శ్లో॥ కాకోలూకస్య పక్షాంస్తు యయోర్నామ్నాతు హోమయేత్
ఉభయోర్నశ్యతిప్రీతిః కురుపాండవయో రివ ।
కాకోలూక ఖరాశ్వానాం చతుర్ణాం గ్రాహయేచ్ఛిరః
నిఖనేత్ ద్వారదేశేతు తద్గృహే కలహఃసదా ।
బ్రహ్మదండ్యాస్తు మూలాని కాకమస్తక మేవ చ
జాతీపుష్పరసైర్భావ్యం సప్తరాత్రం తతః పునః ।
విద్వేష కారకోధూపః శిఖిపిచ్ఛాహి కంచుకమ్
మూష మార్జార రోమాణి విప్రస్యక్షవణస్య చ ।
ధూపోవిద్వేష కః పత్న్యా పత్యుః పిత్రా సుతస్యచ
ఉలూక జిహ్వామాదాయ విదారీ రసభావితా ।
సోదరాణామయం ధూపో భవేద్విద్వేషకారకః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** కాకి - ఉలూక పక్షములు (రెక్కలు) ఎవరిపేర్లతో హోమము చేయుదమో వారిరువురూ పరస్పర స్నేహము కోల్పోయి కురుపాండవులవలె శత్రువులగుదురు.

శ్లో॥ ఏకహస్తేకాకపక్షములూకస్యాపరే కరే ।
దర్భవత్ ధారయేత్ యత్నాత్ త్రిసప్తాహం జలాంజలిమ్॥



నిత్యం నద్యాం ప్రదాతవ్యం అష్టోత్తర సహస్రకం
పరస్పరం భవేద్ద్వేషః సిద్ధయోగ ఉదాహృతః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇపుడు ఒక సిద్ధయోగము చెప్పబడుచున్నది. రెండు చేతులలోనూ ఒక చేతితో కాకి ఈకను, మరొక చేతితో ఉలూక ఈకను దర్భలవలె అనామిక వేలికి ధరించి 3 వారములు ఈ క్రింది మంత్రముతో నదిలో 1008 సార్లు జలాంజలి ఇచ్చినచో సాధ్యవ్యక్తులిద్దరి మధ్య విద్వేషణము కలుగును.

**ఓం ఆమోదకీ ప్రమోదకీ గౌరీ మే (అముకస్య అముకేన సహ) కాకోలూకాదివత్ కురు కురు స్ఫ్రోం స్ఫ్రోం స్వాహా॥**

ఈ పటలమునందు మొత్తం 15 శ్లోకములు మాత్రమే ఉన్నవి. మిగిలినవి అసహ్యకరముగా నుండుటచే వ్రాయుట లేదు.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే విద్వేషణంనామ
షష్ఠ పటలమ్ ॥

* * *

# సప్తమం పటలమ్

## నపుంసకీకరణమ్

ఇందు ఏడు శ్లోకములున్నవి.

శ్లో॥ అమాయాం తు రవౌ గ్రాహ్యం కరంజస్యతు మూలకం
సగుడం భక్షణాత్ సద్యః షండత్వం జాయతే నృణామ్

వృషీ వృషాణాం సంగ్రాహ్యమంతరిక్షేణ గోమయం
సాధ్యస్యప్రతిమాం తేన కృత్వా౽ండే తస్యఖండయేత్
తత్క్షణాత్ జాయతే షండో మంత్రేణానేన మంత్రితమ్ ॥
నక్షత్రే హ్యనూరాధాయాం లాంగలీ మూలముద్ధరేత్
నిశామూత్రస్థలే పుంసో నిఖనేత్ షండతాంవ్రజేత్ ।
సముద్ ధృత్య పునః స్వాస్థ్య పూర్వమంత్రేణ యోజయేత్॥

**ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ కామప్రచండాయ హన హన వైనతేయముఖేన ఖండయ ఖండయ స్వాహా ॥**

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే షండీకరణం నామ సప్తమం పటలమ్ ॥*

* * *

# అష్టమం పటలమ్

## అధికాహారము తీసుకొనుటకు

ఇందు 11 శ్లోకములున్నవి.

శ్లో॥ బ్రధ్నకేనా౽క్షవృక్షస్య పీఠం కృత్వాసనేస్థితః ।
యో౽సౌభుంక్తే ఘృతైఃసార్ధం భోజనం భీమసేనవత్
సంధ్యాయామక్షవృక్షస్య కర్తవ్యమభిమంత్రణం
ప్రాతః పుష్పాణి సంగృహ్య మాలాం శిరసిధారయేత్



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అక్షవృక్షము యొక్క బదనికతో ఆసనం తయారుచేసి ఆ పీటపై కూర్చొని భోజనము చేసినచో భీమసేనునివలె అత్యధిక ఆహారమును తినగలుగును.

సంధ్యాసమయమున - **ఓం నమః సర్వాధిపతయే గ్రసగ్రస శోషయ భైరవీ ఆజ్ఞాపయతి స్వాహా ॥** అను మంత్రముతో అక్ష వృక్షమును అభిమంత్రించాలి. మరుసటి దినమున ఉదయముననే ఆ చెట్టుయొక్క పూలతో మాలిక చేసి, దానిని శిరస్సునకు చుట్టి భోజనము చేసినచో అధికాహారము భక్షింప సమర్థుడగును.

## ఆకలి లేకుండుటకు

శ్లో॥ పద్మబీజం మహాశాలీం ఛాగ దుగ్ధేన పాచయేత్
సాజ్యంతత్ పాయసం భుక్త్వా ద్వాదశాహం క్షుధాపహమ్ ।
ఉదుంబరఫలం పక్వ మంకులీ తైల పాచితం
భుక్త్వామాసం క్షుధాంహంతి పిపాసాం నాత్రసంశయః
అపామార్గస్య బీజాని సంఘృతాని ప్రపాచయేత్
అపామార్గస్య బీజాని సఘృతాని ప్రపాచయేత్
పాయసమావికాక్షీరైః భుంక్తే మాసం క్షుధాపహమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఈ క్రింది మంత్రసిద్ధిని పొందిన సాధకుడు, ఆకలి దప్పికలు 12 రోజుల వరకూ లేకుండా ఒక "తంత్రము" చెప్పబడుచున్నది -

**ఓం నమో భగవతే రుద్రాయ అమృతార్ణవ మధ్యసంస్థాయ మమ శరీరే అమృతం కురు కురు సహ స్వాహా ॥**

మేకపాలతో పద్మబీజములు, శాలిబియ్యము వండి ఆ పాయసమును నేతితో భక్షించిన 12 రోజుల వరకు ఆకలి ఉండదు. అపామార్గ బీజములు, మేకపాలు, నెయ్యితో వండి దానిని భక్షించిన ఒక నెలరోజులు ఆకలి ఉండదట ! (ఇది శాస్త్రీయముగా పరిశోధించ వలసిన విషయము)

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే అత్యాహార, అనాహార కధనం నామ అష్టమం పటలమ్ ॥*

❋ ❋ ❋

# నవమం పటలమ్

ఇందు అయిదు శ్లోకములున్నవి యోని బంధనము చెప్పబడినది.

# దశమ - ఏకాదశ పటలములు

శ్లో॥ అంజనానాంతు సర్వేషాం మంత్రైః సాధ్యమఘోరకైః
వినాఘోరేణ విఘ్నాని నాశయంతి పదే పదే ।
దక్షిణామూర్తి మాసాద్య జపేదష్ట సహస్రకం
..........................................................
..........................................................



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అంజన మంత్రము లన్నియూ ముందుగా అఘోర మంత్రసిద్ధి పొందిన పిమ్మటనే సాధించవలయును. అఘోరమంత్రము సిద్ధి కలిగినచో విఘ్నములు కలుగవు. ఈ క్రింది మంత్రము అఘోర మంత్రమనబడును. దీనిని దక్షిణామూర్తి సన్నిధిలో 8000 జపించాలి.

**రుద్రాయ నమో బహురూపాయ నాశయ విశ్వరూపాయ నమో విశ్వాయ విశ్వరూపాయ నమస్త పురుషాయ నమో యక్షి రూపాయ నమః ఏకయక్షాయ నమః ఏకరోమాయ నమః ఏక మణయే నమో వరదాయ నమస్త్రక్షాయ నమో రుద్రాయ స్వాహా॥**

సాధకుడు ఉపవాస - నియమ - బ్రహ్మచర్యముతో శివపూజ చేసి ఈ మంత్రం సిద్ధింపచేసుకోవాలి.

అంజనము తయారుచేయుటకు సాధకుడు గురుగృహము నుండి, లేదా సన్యాసి నివాసమునుండి, లేదా చాకలి గృహము నుండి అగ్నిని తీసుకురావలయును.

**అగ్ని గ్రహణ మంత్రం - ఓం జ్వలిత ద్యుతిదేహాయ స్వాహా ।**

**అగ్ని రక్షా మంత్రం - ఓం నమో భగవతే వాసుదేవాయ పాతాలం బంధ, మండలం బంధ, బంధ, స్వాహా ॥**

**వత్తి అభిమంత్రణం - ఓం వర్తి బంధ దిశంబంధ పాతాలం బంధ, మండలం బంధ, బంధ, స్వాహా ॥**

దీపము జ్వలించు సమయములో జపించు మంత్రము –

**ఓం నమో భగవతే సిద్ధి శబరాయ జ్వల జ్వల పతపత పాతయ పాతయ బంధ బంధ సంహన సంహన దర్శయ దర్శయ నిధిం నమః ॥**

**కాటుక గ్రహించు మంత్రం – ఓం ఇం సర్వసిద్ధిభ్యో నమః, విచ్చే స్వాహా ॥**

**అంజనము తయారుచేయుటకు ఉపయోగించు ద్రవ్యమును, అభిమంత్రించు మంత్రం – ఓం కాళి కాళి రక్ష రక్ష మదంజనం నమో విచ్చే స్వాహా ॥**

ముందుగా సువర్ణ శలాకతో అంజనము ధరించాలి. అటు పిమ్మట సాధారణమైనది ఉపయోగించవచ్చు.

కళ్లకు అంజనము పెట్టుకొనిన పిమ్మట ఏడు శుభ్రమైన రావి ఆకులతో కనులు మూసి పైన తెల్లని గుడ్డతో కట్టాలి. అంజనము ధరించు వ్యక్తికి అధికాంగములు ఉండరాదు, అంగవిహీనుడుగా ఉండరాదు.

ఆ వ్యక్తి సంపూర్ణ అవయవములతో ఆరోగ్యముగా శుచిగా ఉండాలి. రెండు రోజులు ముందుగా పగలు ఉపవాసం ఉండి రాత్రి భోజనం చేయుచుండినవాడై యుండాలి. అటువంటి వ్యక్తికి అంజనము ధరింపచేయాలి. ముందుగా ఈ మంత్రముతో అతనికి శిఖాబంధనము చేయాలి.

**– ఓం రక్ష రక్ష విచ్చే స్వాహా ॥**



అన్ని అంజనములూ ఇదే విధముగా పూర్యవిధి చెప్పబడి యున్నవి. దక్షిణామూర్తి సన్నిధిలో రాత్రియంతయూ ఈ క్రింది మంత్రం జపించాలి.

**ఓం నమో భగవతే రుద్రాయ ఓ మానహ హాలు హాలు, విహాలు విహాలు, హా హా యక్ష పూజితే, యక్ష కుమార్యాః సులోచనే స్వాహా ॥**

## నిధి దర్శనమ్

శ్లో॥ రోచనం కుంకుమం శంఖం బాలపుష్పీం చ చందనం
రాజావర్తం కుమారీం చ సౌవీరాంజనపారదే ।
కజ్జలంకాం చనీం చైవ సితపద్మస్యకేసరం
యావకం సఘృతం క్షీరం సమభాగం సుపేషయేత్ ।
శ్మశాన చేలమాదాయ పూర్వపిష్టేనలేపయేత్
తద్వర్తిం ఘృతసంయుక్తాం ప్రజ్వాల్యకజ్జలం హరేత్ ।
సర్వాంజనమిదం ఖ్యాతం పాతాల నిధి దర్శనం
శరత్కాలేతు సంగ్రాహ్య భూలతా రక్తవర్ణికా ।
సింధూరపూరితాం కృత్వా రవితూలేపేన షష్పయేత్ ॥

..........................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** గోరోచనం – కుంకుమ పువ్వు – శంఖచూర్ణం – బాలపుష్పి – చందనం – రాజావర్త రత్నం – కలబంద – సౌవీరాంజనం పాదరసం – పసుపు – తెల్ల

కలువకేసరములు – దేవకాంచనం (?) (కాంచని ?) నెయ్యి – పాలు, యవలు – సమానముగా గ్రహించి నూరాలి.

పిమ్మట శ్మశానమునుండి శవవస్త్రము తీసుకువచ్చి దానితో వత్తిచేసి, పూర్వం చేసిన మిశ్రమంలో తడిపి, దానిని వెలిగించి దానితో కాటుక తయారుచేయాలి. దీనినే "సర్వాజనం" అంటారు. ఇది కనుక పూర్వోక్త విధానములో ఉపాసకునికి, లేదా నియమము పాటించిన వ్యక్తికి కాటుకవలె పెట్టి, రావి ఆకులతో తెల్లనివస్త్రము బంధించిన – నిధి దర్శనము కలుగును.

శరత్కాలమందు ఎర్రభూలత గ్రహించాలి. దానికి సిందూరము పూసి జిల్లేడుపత్తితో చుట్టాలి. నల్లనువ్వుల నూనెతో ఆ వత్తిని తడిపి, ఉత్తరాయణం మకరసంక్రాంతిరోజున వెలిగించి దానితో కాటుక తయారుచేయాలి. ఈఅంజనధారణచే భూగర్భనిధులు దర్శనమగును.

శ్లో॥ కుంకుమం శ్వేతగుంజా చ కాంచనస్యైవపల్లవం
సుశ్వేతం చ జపాపుష్పం సూర్యావర్తిం సమం మధు।
సర్వాంజనమిదం ఖ్యాతం పాతాల నిధి దర్శనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** కుంకుమపువ్వు – శ్వేత గురివింద – కాంచన వృక్షం చిగుళ్లు, పొద్దుతిరుగుడు తెల్ల జపా పుష్పం (?) ఇవన్నీ తేనెతో నూరి, వీటితో తయారుచేసిన అంజనము పాతాళనిధులను దర్శింపచేయును.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే అంజన నామక దశమ - ఏకాదశ పటలౌ సమాప్తౌ ॥*

❊ ❊ ❊



# ద్వాదశపటలమ్

## పాదాంజనమ్

శ్లో॥ తులసీ మూలికాం పుష్యే శనివారే సముద్ధరేత్
నిష్పిష్య కాంజికేనాథ మధునాయుత మంజయేత్ ।
పాదజాతే కుమారంవా కన్యకాం వా తతోనిధిః
దృశ్యతే నాత్ర సందేహో పాతాలాంతర్గతస్తథా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇపుడు పాదాంజన విధి తెలుపబడుచున్నది. శనివారం పుష్యమీ నక్షత్రం రోజున, తులసీ మూలము గ్రహించి, గంజితో లేదా బియ్యపుకడుగు మర్దించి తేనె మిశ్రమం చేయాలి. దీనిని కన్యకు, లేదా బాలునకు అరికాళ్లకు లేపనము చేసిన పాతాళనిధి దర్శనమగును. (కాంజికమనగా బియ్యపుకడుగు అని కూడా అర్థమున్నది.)

ఈ అంజనము తయారుచేయు ప్రతీ సందర్భములోను ఈ క్రింది మంత్రము జపము చేయవలయును. ముందుగా మంత్రము 18,000 జపించిన మంత్రసిద్ధి కలుగును.

**ఓం నమో భగవతే రుద్రాయ ఉడ్డామరేశ్వరాయ శిల శిల ధమనే నాలి భేతాలి స్వాహా ॥**

శ్లో॥ పాశ్చాత్యంపిప్పలీ మూలం పుష్కార్కే విధినోద్ధృతం
పాతాళమధునాయుక్తం పాదజాతాంజనం భవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పుష్యార్కయోగమున (ఆదివారం - పుష్యమీ నక్షత్రం) పశ్చిమదిశగా వెళ్లు రావివేరు గ్రహించి, దానిని పాతాళ మధువుతో (?) మర్దించిన పాదాంజనము సిద్ధించును. దీనివలన భూగర్భ నిధి దర్శనమగును.

అలాగే పుష్యార్కయోగమున తెల్లగన్నేరు మూలముతో పాతాళ మధువు (?) మిశ్రమం చేసి నూరిన పాదాంజనము సిద్ధించును. దీనిని అరికాళ్లకు ఉపాసకునికి లేదా కన్యకకు పూసినచో భూగర్భ నిధులు దర్శనమగును.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే పాదాంజనం*
*నామ ద్వాదశం పటలమ్ ॥*

❋ ❋ ❋

# త్రయోదశం పటలమ్

## లేపాంజనమ్

శ్లో॥ గోక్షీరేణ తు సంపిష్య తిలకోద్రవ రాజికాః
కణాబీజం చ సంపిష్య నిశాయాం చ నిధిస్థలమ్ ।
భ్రష్టోలేపో భవేద్యత్ర ప్రాతస్తత్ర నిధిం దిశేత్
బ్రహ్మవృక్షస్య పత్రాణి కాకోలీరస పేషితమ్ ।
అర్జునస్య కదంబస్య బకస్య ఖదిరస్య చ
నిశాయాం లేపయేత్ భూమౌ కల్కంమంత్రేణ మంత్రయేత్।



ప్రాతర్లేపోనయత్రాస్తి తత్రైవ నిధిమాదిశేత్

..........................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇపుడు నిధి స్థానము అనుమానముగా నున్నచోట ఈ లేపాంజన ప్రయోగము చేసినచో అసలు అక్కడ నిధి ఉన్నదీ, లేనిదీ స్పష్టముగా తెలియును.

ఆవుపాలలో తిలలు, కోద్రవములు (?), తెల్లావాలు, రావిబీజ ములు నూరిన, లేపాంజనము తయారగును. దీనిని నిధి ఉన్నదను అనుమానము గల ప్రదేశమునందు రాత్రివేళ లేపనము చేయ వలయును. ఉదయమున ఆ లేపనము లేకపోయిన కరిగిపోయిన అచట నిధి ఉన్నట్లు తెలుసుకొనవలయును.

### మరియొక ప్రయోగము

అర్జున - కదంబ - బక - ఖదిర - పలాశ వృక్షముల ఆకులు, కాకోలీ రసముతో నూరాలి. రాత్రియందు ఈ మంత్రముతో ఆ కల్కమును అభిమంత్రించాలి.

**ఓం నమో భగవతే రుద్రాయ కల్కలేపాంజనం దర్శయ స్వాహా ఠః ఠః స్వాహా ॥**

పిమ్మట నిధి ఉన్నదను స్థలమున రాత్రియందు ఈ లేపాం జనము లేపనము చేసి ఉదయమున పరిశీలించవలయును. లేపనము లేనిచో, కరిగిపోయిననూ అచట నిధి ఉన్నదని తెలుసు కోవాలి.

మరియొక విధానమిట్లున్నది – నిధి అనుమాన స్థలమునందు అష్టమాతృకలను అర్చించి, కిరాత వేషధారి అయిన శివుని పూజించి, రాత్రియందు పైన చెప్పిన మంత్రముతో గుగ్గిలహోమము ఆచరించాలి. ప్రాతఃకాలమున ఆ స్థానము వివర్ణముగా అయినచో అచట నిధి ఉన్నదని తెలుసుకోవాలి.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే లేపాంజనం నామ త్రయోదశ పటలమ్ ॥*

✻ ✻ ✻

# చతుర్దశం పటలమ్

## అథద్రావణమ్

శ్లో॥ అర్కమూలం సకర్పూరం హరిద్రాం కనకం మధు
మోషీపిత్తేన లేపోయం లింగస్త్రీదావ కారకః ।
శైవాలి పుష్పం కర్పూరం ముండి పుష్పంచ పేషితం
లింగలేపాత్ వశంయాంతి ద్రవంతి రతి సంగమే ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శైవాలిపుష్పం – కర్పూరం – ముండిపుష్పం (?) కలిపి నూరి పురుషాంగమునకు లేపనము చేసి స్త్రీ సంగమము చేసిన భావప్రాప్తి సులభముగా జరిగి ద్రావణ మగును. స్త్రీ త్వరగా ద్రవించును.



జిల్లేడు మూలము – కర్పూరము – పసుపు – నల్ల ఉమ్మెత్త మేక పిత్తము – తేనె, ఇవన్నీ సమభాగములుగా గ్రహించి నూరి, దానిని లేపనము చేసుకొని స్త్రీని రమించిన ఆమె ద్రవితమగును. ఈ రెండు ప్రయోగములు మంత్రపూర్వకముగా చేయవలయును.

### ద్రావణ మంత్రము

**ఓం కం దం లం న్నేం హ్రీం రసాథికా స్రవతు (అముకీం) రతికాలే దేవదూష్ణీం స్వాహా ॥**

ఈ మంత్రము సిద్ధించిన పిమ్మట, సంగమకాలమందు జపించిన, ద్రావితమగును. ఆమె అత్యంతానుకూలముగా వశవర్తియై యుండును. 8 వేలు జపించిన మంత్రము సిద్ధించును.

ముందు చెప్పిన మూలికాప్రయోగములకు ద్రావణ మంత్ర మిట్లున్నది.

**ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ ద్రావయ ద్రావయ స్త్రీణాం మదం పాతయ పాతయ స్వాహా ॥**

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే ద్రావణం నామ చతుర్దశం పటలమ్ ॥*

✻ ✻ ✻

# పంచదశం పటలమ్

## అథ పతి వశీకరణమ్

శ్లో॥ మాలతీ పుష్ప సంయుక్తం కటుతైలం సుపాచితం
ఏతైర్లిప్త భగానారీ రతౌ మోహయతే పరమ్ ।
పుత్రజీవీ తురక్తా చ ప్రియంగు గిరికర్ణికా
శ్వేతాపరాజితామూలం సమాంశశ్చవిచూర్ణితమ్ ।
దీయతే పశ్చిమే రాత్రౌ తాంబూలేన తు వశ్యకృత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం:-** ఎర్రపుత్ర జీవి – ప్రియంగు – గింకర్ణికా – శ్వేతాపరాజిత్ మూలం సమభాగములుగా గ్రహించి చూర్ణము చేసి, తాంబూలములో కొద్దిగా కలిపి, రాత్రియందు భర్తకు ఇచ్చినచో భర్త వశుడై యుండును. మాలతీపుష్పములు ఆవనూనెలో మరగించి, ఆ నూనెను కొద్దిగా యోని లేపనము చేసుకొనినచో భర్తతో ఆమెతో రమించిన పిమ్మట, వశవర్తుడై యుండును.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే
పతివశీకరణం నామ
పంచమ పటలమ్ ॥

❊ ❊ ❊



# షోడశం పటలమ్

## కౌతుకమ్

ఈ పటలమునందు కొన్ని ఆశ్చర్యకర ప్రయోగములు చెప్పబడినవి. రక్షావిదిగా ముందుగా కొన్ని ప్రక్రియలు వివరించబడినవి.

శ్లో॥ నాసారంధ్రద్వయం లిప్త్వా గో ఘృతేన తతోముఖే ।
క్షిపేత్ బింబీఫలం యస్య కుయోగై ర్నస బాధతే ॥
తగరాంజిత నేత్రోవా తగరేణాథ ధూపితః
పూర్వం రక్షావిధిం కృత్వా పశ్చాత్ కౌతుక మావహేత్।
వినారక్షావిధానేన యః కరోతి ససీదతి ।

..........................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం:-** గోఘృతము రెండు ముక్కు రంధ్రములలోనూ లేపనం చేయాలి. బింబీఫలము (దొండకాయా?) నోటియందుంచుకోవాలి. ఇలా చేసినచో చెడు క్రియలవల్ల బాధ కలుగదు.

తగరకాష్ఠములచే (?) తయారుచేసిన అంజనము కళ్లకు ధరించిననూ, వాటితో ధూపము వేసుకొనిననూ, కౌతుక కార్యమందు ఆత్మరక్ష కలిగించును.

మంగళవారము పుష్యమీ నక్షత్రమునాడు ఒక కృకలాసము (బల్లి)ని తెచ్చి, కొత్త పాత్రయందు బంధించాలి. దానికి ఎర్రని

పుష్పములతో ధూపదీప గంధాక్షతలతో పూజించి నైవేద్యమివ్వాలి. అందుకు **"ఓం అంకోలాయ ఓం రః హ్రీం హ్రీం హ్రీం"** అను మంత్రము నుపయోగించాలి. ఇది 108 సార్లు జపించాలి.

అటు పిమ్మట తన ఎడమచేయి చిటికెన వేలి రక్తముతో దానిని తడపాలి. ఈ విధముగా ఏడురోజులు చేయాలి. ఆ మంత్రము సిద్ధించినచో,

ఆ కృకలాస చూర్ణము తాళపత్రమునకు లేపనము చేసి కింద పడవేసిన సర్పభ్రమ కలుగును. తమలపాకుకు లేపనము చేసి కింద పడవేసిన అది ఎగిరెగిరి పడును.

## అంకోలతైల నిర్మాణవిధి

శ్లో॥ సప్తాహం తిలతైలేన భావయేదాతపే ఖరే
అంకోల బీజ చూర్ణంతు శోష్యం పేష్యం పునః పునః
తత్ తైలం గ్రాహయేచ్చైవ తైలకారస్యయంత్రతః

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** అనేక ఇంద్రజాల ప్రయోగములకు, కనికట్టుకు అంకోల తైలము యొక్క ప్రయోగము అనేక తంత్రములందు చెప్పబడినది.ఆ తైలము చేయు విధానము చెప్పబడుచున్నది.

అంకోలవిత్తనములు లేదా గింజలు 7 రోజులు పాటు నువ్వుల నూనెలో వేయించి చూర్ణం చేసి ఎండలో ఎండించాలి. పిమ్మట



తైలయంత్రమునందుంచి వాటినుండి నూనెను తీయాలి. (ఇది అసాధ్యముగా కనబడుచున్నది, అంత ఎక్కువగా వేయించిన నూనె ఎలా వస్తుంది)

శ్లో॥ తత్తైలం లిప్తమాత్రాండం శోషితం నిఖనేత్ క్షణాత్
సఫలోజాయతే వృక్షస్తత్ క్షణాత్ నాత్ర సంశయః ।

ఈ అంకోల తైలము లేపనము చేసిన మామిడి టెంకను, ఎండలో బాగా ఎండించాలి. పిమ్మట దానిని భూమిలో పాతినచో వెంటనే అది మొలకెత్తి మొక్కగా మారును. దానికి మామిడికాయ కాయును (?).

అంకోలతైలముతో కొన్ని ప్రయోగములు చెప్పబడినవి.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే కౌతుకం నామ షోడశ పటలమ్ ॥*

* * *

# సప్తదశం పటలమ్

## అథ పాదుకాసాధనం

శ్లో॥ అథచాం కోల తైలేన పేషయేత్ శ్వేత సర్షపాన్
తల్లిప్త హస్తపాదంతు యోజనానాం శతం వ్రజేత్ ।

....................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** తెల్లావాలు, అంకోల తైలముతో నూరి, ఆ ముద్దను అరచేతులకు, అరికాళ్లకు లేపనము

చేసుకొనిన ఎంత దూరమైనా నడిచి వెళ్లగలదు. అలసట రాదు. దీనికి ముందుగా ఈ మంత్రసిద్ధి పొందాలి.

**ఓం నమో భగవతే రుద్రాయ భూత బేతాళ త్రాసనాయ శంఖ చక్ర గదాధరాయ హ స హ స, మహతే చంద్రయుతాయ హుం ఫట్ స్వాహా ॥**

నువ్వులనూనెలో కాకతుండిమూలము ఉడకబెట్టి లేపనము చేసి, దాని అరికాళ్ళనుండి కాలిపిక్కలవరకు పూసుకొని ఎంతదూరమైనా నడువగలడు. అలసట రాదు.

## మరికొన్ని ప్రయోగములు

గుడ్లగూబ – బల్లి – మిణుగురు పురుగు – చిలకపిత్తాశయము – కాకి పిత్తము – పిల్లి మాంసము మొదలగు వాటితో చెప్పబడినవి. అవి వ్రాయుట లేదు.

శ్లో॥ ప్రతీచీ దిగ్గతం మూలం దేవదాళ్యాః సమాహరేత్
తత్ పిష్ట్వాం కోలతైలేన పాదలేపాచ్ఛృతం వ్రజేత్ ।

దేవదాళి వృక్షముయొక్క పశ్చిమ దిశగా వెళ్లు మూలము గ్రహించి, దానిని అంకోలతైలముతో మర్దించాలి. దానిని పాద లేపనముగా పూసుకొనినచో వందయోజనములు నడువగల సామర్థ్యము వచ్చును.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే గుటికాది సాధనం నామ అష్టాదశం పటలమ్ ॥*

❋ ❋ ❋



# ఊన వింశపటలమ్-వింశపటలమ్

ఊనవింశ పటలమందు అదృశ్యీకరణము చెప్పబడినది. అయితే సాధనలో పంచముండాసనా విధులు (అయిదు మనుష్యక పాలములు) శవసాధన ఉన్నందున అవి వ్రాయుటలేదు. శ్లోకములు 70 ఉన్నవి. వింశపటలమందు ఆకర్షణ విధానము చెప్పబడినది.

## ఆకర్షణ

శ్లో॥ ఆకారే మంత్రయేత్పాశం క్రోంకారే చాంకుశం తథా
త్రిగుణంవామగం పాశం దక్షిణే జ్వలితాంకుశమ్ ।
ధారయేత్ స్వకరే మంత్రీ తతో మంత్ర మిదంజపేత్

.................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఆం – క్రోం బీజములతో అభిమంత్రించి, పాశమును ఎడమచేతియందును, అంకుశమును కుడిచేతియందును భావించి

**ఓం హ్రీం రక్తచాముండే తురుతురు (అముకీం) ఆకర్షయ హ్రీం స్వాహా ।**

అను మంత్రమును పదివేలు జపించి సిద్ధిపొందిన పిమ్మట సాధకుడు 21 రోజులు సంధ్యాకాలమందు సాధ్యవ్యక్తిని భావించి నామసహితముగా జపము చేసినచో, సాధ్యవ్యక్తి ఆకర్షితుడై సాధకుని వద్దకు వచ్చును.

ఎర్రని వస్త్రమునందు ఎర్రచందనము, లాక్షాతో ఆకర్షణ యంత్రము లిఖించి, పూజించి భూమియందు పాతవలయును. 21 రోజులు ప్రాతఃకాలమునందు తండులోదకముతో ఆ స్థలమును తడుపుచుండ వలయును. సాధ్యవక్యక్తి ఎంత దూరములో నున్ననూ సాధకుని వద్దకు వచ్చును.

ఇదే ప్రయోగము కలశస్థాపన చేసి 21 రోజులు ఆచరించి ననూ ఆకర్షణ సిద్ధించును.

శ్లో॥ ఆశ్లేషాయాం సమాదాయ హ్యర్జునస్థాయబ్రధ్నకం
అజామూత్రేణ సంపిష్య స్త్రీణాంశిరసి నిక్షిపేత్ ।
పురుషస్య పశూనాంచ క్షిపేదాకర్షణం భవేత్

..................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఆశ్లేషా నక్షత్రంరోజున అర్జున వృక్షబదనిక తెచ్చి, మేకమూత్రముతో మర్దించాలి. దీనిని ఏ స్త్రీ శిరస్సుపై చల్లిననూ ఆమె సాధకునికి ఆకర్షితురాలగును.

స్నహీ కాష్ఠమును తెచ్చి **"హ్రీం విలి విలి ఛింధి ఛింధి, హన హన, పచ పచ, శోషయ శోషయ, సర్వవిద్యాధిపతయే నమః** అను మంత్రముతో 108 సార్లు అభిమంత్రించి సాధ్యవ్యక్తి నామముతో భూమియందు పాతినచో అతడు ఆకర్షితుడగును.

'ఓం ఆంక్షాం చాదుం చాదుం ఫట్" ఈ మంత్రము ఒక లక్ష జపము చేసిన సిద్ధించును. సాధ్యవ్యక్తిని ధ్యానించి జపము చేసినచో ఆకర్షితులై వచ్చెదరు.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే ఆకర్షణం నామ వింశపటలమ్ ॥*



# ఏకవింశం పటలమ్

## అధోచ్చాటనమ్

శ్లో॥ ఏనాహృతం గృహం క్షేత్రం కళత్రంధన ధాన్యకం ।
మానంవాఖండితం ఏన తస్య దండో విధీయతే ॥
పంచాంగుళం చిత్రకస్య మూలంగ్రాహ్యంపునర్వసౌ
సప్తాభిమంత్రితంగేహే నిఖన్యోచ్చాటనం భవేత్ ।
స్వాత్యా మౌదుంబరబ్రధ్నం మంత్రితం చతురంగుళం
తంయస్య నిఖనేద్గేహే తస్యైవోచ్చాటనం భవేత్ ।
భరణ్యామంగుళీమాత్రములూకాస్థిచ కీలకం
సప్తాభిమంత్రితంయస్య నిఖన్యోచ్చాటనం భవేత్ ।
కాకోలూకస్య పక్షంతు హుత్వా హ్యష్టాధికం శతం
యన్నామ్నా మంత్రయోగేన సర్వస్యోచ్చాటనం భవేత్।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** తనయొక్క గృహం – పొలం – ధనం – భార్య – అపహరించినవారిని, తనకు అత్యంత అవమానము చేసినవారిని తప్పక దండించాలి. పరులచేత పీడలు పొందినవారు తమ శత్రువులపై ప్రతీకారంగా చేసే ప్రయోగమే "ఉచ్చాటనం" – అంటే ఆ స్థానం వదలి వెళ్ళిపోవడం.

పునర్వసు నక్షత్రమునాడు చిత్రమూలంకాష్ఠము **"ఓం లోహిత ముఖ స్వాహా"** అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి సాధ్యవ్యక్తి ఇంటిలో పాతిపెట్టిన, అతనికి ఉచ్చాటనమగును.

స్వాతి నక్షత్రమునాడు మేడిబదనికను నాలుగు అంగుళము కలది తెచ్చి, **"ఓం గిలి స్వాహా"** అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి గృహమునందు పాతిపెట్టిన, ఉచ్చాటన మగును.

భరణీ నక్షత్రమునందు ఉలూకముయొక్క ఎముక అంగుళ మాత్రము తెచ్చి **"ఓం దహదహ దలదల స్వాహా"** అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి గృహమందు పాతిన, అతనికి ఉచ్చాటన మగును.

కాకి – ఉలూక పక్షములు తెచ్చి, ఈ క్రింది మంత్రముతో 108 సార్లు హోమము చేసిన సాధ్యవ్యక్తి ఉచ్చాటనమగును. 108 ఆహుతులకు 108 పక్షములు అవసరమగును.

**"ఓం నమో భగవతే రుద్రాయ (అముకం) గృహ్ణాగృహ్ణా, పచపచ, త్రాసయత్రాసయ, త్రోటయత్రోటయ, నాశయ నాశయ, పశుపతిరాజ్ఞా పయతి స్వాహా ॥**

శ్లో॥ మధ్యాహ్నే లుంఠతే భూవౌ భోయత్ర ధూళికాం
ఉదంగ్ముఖ ఉదీచ్యాంతు గృహ్ణీయాత్ వామపాణినా।
యద్ గృహే క్షిప్యతే ధూళిః తస్యైవోచ్చాటనం భవేత్
అశ్వత్థకీలమశ్విన్యాం నిఖనేత్ సప్తమంత్రితం ।
యస్య గేహే భవేత్ సత్యం శీఘ్రముచ్చాటకారకం
కృత్తికాయాం సర్జకీలం నిఖనేత్ సప్తమంత్రితమ్ ।



యస్యగేహే చ తం శత్రుం శీఘ్రముచ్చాటయేద్ గృహాత్
నింబకీలక మార్ద్రాయాం నిఖనేత్ సప్తమంత్రితం ।
యస్యగేహే చ తంశత్రుం శీఘ్రముచ్చాటయేద్ గృహే
శివాలయాద్ భౌమవారే ఆదాయ చతురిష్టికామ్ ।
ప్రత్యేకం ప్రతికోణేతు నిఖనేత్ శత్రుమందిరే
నిఖనేత్ తద్ గృహద్వారి అధః పుష్పం సచందనమ్।
సప్తరాత్రే న సందేహో మహదుచ్చాటనం భవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మధ్యాహ్నకాలమందు గాడిద మట్టిలో పొర్లుతున్నపుడు ఆ స్థలములోని మట్టిని ఉత్తర ముఖముగా, ఈక్రింది మంత్రముతో ఎడమచేయిద్వారా కొంత (ధూళిని) గ్రహించాలి. దానిని సమంత్రకముగా సాధ్యవ్యక్తి ఇంటిలో చల్లిన ఉచ్చాటనము సిద్ధించును.

**ఓం నమో భగవతే రుద్రాయ జ్వాలాగ్ని సంఖ్యా దంష్ట్రా ద్రావణాయ స్వాహా ॥**

అశ్వినీ నక్షత్రమునందు రావి కాష్ఠమును తెచ్చి, ఈ క్రింది మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి గృహములో పాతిన ఉచ్చాటన మగును. **"ఓం ఖం సఃఖః ఖాఖావినీ స్వాహా॥** అని ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి గృహమునందు పాతినచో ఉచ్చాటనమగును.

ఆర్ద్రానక్షత్రమందున నిమ్మ కర్రను తెచ్చి, **"ఓం నమో భగవతి కాయరూపిణి స్వాహా"** - అను మంత్రముతో ఏడుసార్లు అభిమంత్రించి, సాధ్యవ్యక్తి గృహమందు పాతిన ఉచ్చాటన మగును.

మంగళవారమునాడు, శివాలయమునుండి 4 ఇటికలు తెచ్చి **"ఓం భగవతే ఉడ్డామరేశ్వరాయ వాయురూపాయ చునుచును ఠః ఠః"** అను మంత్రముతో అభిమంత్రించి, శత్రుగృహముయొక్క నాలుగు కోణములందు (ఈశాన్యం - ఆగ్నేయం - నైఋతి - వాయవ్యములందు) ఒక్కొక్క ఇటికను పాతిపెట్టవలయును.

పిమ్మట శత్రుగృహద్వారము వద్ద చందన సహితముగా శివ నిర్మాల్యము సమంత్రకముగా పాతిపెట్టవలయును. ఏడు రోజులలో ఉచ్చాటనమగును.

శ్లో॥ గుంజామూలం గృహద్వారే నిఖన్యోచ్చాటనంభవేత్
అథవా మూలనక్షత్రే న్యస్తం ఖదిరబ్రధ్నకమ్ ॥
ధాత్రీఫలస్య చూర్ణంతు హ్యంకులీ తైలభావితం
ఉచ్చాటితో భవేత్ మూర్ధ్ని స్నానాత్ గోక్షీరతః సుఖీ ।
కృష్ణపక్షే శనౌభౌమే భరణ్యార్ద్రాధ కృత్తికా
చితికాష్ఠాప్రమాదాయ కీలకం చతురంగుళమ్ ।
వేష్టయేత్ శవకేశైస్తు చాగ్నేయాం దిశిమంత్రయేత్
అష్టోత్తర శతం జప్త్వా సూర్యందృష్ట్వా తికోషతః ।
తంతస్య నిఖనేద్ ద్వారే శీఘ్రముచ్చాటనం భవేత్ ॥



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** గుంజామూలం సాధ్యవ్యక్తి ద్వారము వద్ద పాతినచో ఉచ్చాటనమగును. మూలా నక్షత్రమునందు చంద్ర బదనిక శత్రుగృహద్వారము వద్ద పాతిన ఉచ్చాటన మగును.

ఉసిరిచూర్ణము, అంకోలతైలముతో నూరి, శత్రువు శిరస్సుపై లేపనము చేసిన ఉచ్చాటనమగును. ఆవుపాలతో స్నానము చేసిన ఈ దుష్ఫలితము తొలగిపోవును.

కృష్ణపక్షమునందు శనివారము, లేదా మంగళవారము, భరణి - ఆర్ద్రా - కృత్తికా నక్షత్రమునందు, నాలుగు అంగుళముల చితికాష్ఠమునకు శవకేశములు చుట్టి, ఆగ్నేయముఖముగా ఈ క్రింది మంత్రముచే 108 సార్లు అభిమంత్రించాలి.

**ఓం హ్రీం యమయమ ఉల్లూకకరాళే విద్యుజ్జిహ్వా (అముకం) ఉచ్చాటయ హుంఫట్ ॥**

పిమ్మట క్రోధముగా సూర్యదర్శనముచేసి, శత్రుగృహ ద్వారము వద్ద పాతిన ఉచ్చాటనమగును.

శ్లో॥ ఉష్ట్రారూఢం రిపుంధ్యాత్వా హన్యాత్ దండేన మంత్రితః
దక్షిణాదిక్ త్రిసప్తాహం దేశాదుచ్చాటయేద్రిపుమ్ ।
కాకపక్షం రవౌగ్రాహ్యం వేష్టయేదహి కంచుకైః
కుసుంభసూత్రస్తద్ బాహ్యే వేష్టితవ్యం తతః పునః ।
నింబపత్రేరిపోర్నామ లిఖిత్వా వేష్టయేచ్చ తం
తద్బహిశ్చిత భస్మేన మృతవస్త్రేణ వేష్టయేత్ ।
తంయస్యనిఖనేత్ ద్వారే తస్యైవోచ్చాటనంభవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** 1) శత్రువును ఒంటెమీద అధిరోహించినట్లు భావించి దక్షిణాముఖంగా ఈ క్రింది మంత్రం జపించుచూ, ఒక బెత్తముతో భూమిపై కొట్టుతూ ఉండాలి. ఇలా 21 రోజులు చేసిన, ఉచ్చాటనమగును. 2) ఆదివారమునాడు కాకి ఈక –తెచ్చి, దానికి పాము కుబుసము చుట్టి దానిపై ఎర్రని దారం కట్టి, నిమ్మఆకుపై శత్రునామము లిఖించి దానిపై కాకపక్షమునుంచి చుట్టి దానిపై చితాభస్మము పూసి, దానికి మృతవస్త్రము కట్టి, శత్రు ద్వారమువద్ద పాతినచో ఉచ్చాటనమగును. మంత్రము 2వ సంఖ్యలో ఇవ్వబడినది.

**1. ఓం హ్రీం యమయమ ఉల్లూక కరాళే విద్యుజ్జిహ్వే (అముకం) ఉచ్చాటయ హుం ఫట్।**

**2. ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ ఉచ్చాదయ ఉచ్చాదయ, విద్వేషయ విద్వేషయ, హన హన, ఠః ఠః ॥**

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే ఉచ్చాటనం నామమే ఏకవింశ పటలమ్ ॥*

❊ ❊ ❊

# త్రయోవింశ పటలమ్

## అథకాల వంచనమ్

శ్లో॥ రోచనైః కుంకుమైర్లాక్షా నామికారక్త సంయుతైః
ద్వాదశారం లిఖేత్ పద్మం తద్బహిశ్చైవ తత్సమమ్ ।



షోడశారంతతో బాహ్యే మూలంబీజం తతోలిఖేత్
ప్రథమస్యదళే వర్షం మాసంశ్చైవ బహిర్దళే ।
దివసాః షోడ శారేతు సాధ్యనామ చ కర్ణికే
పూజయేత్ చక్రవత్తాంస్తు తదంతే తన్నిరీక్షయేత్ ।
యద్దలేవాஉక్షరం లుప్తం తద్దినే మ్రియతే ధృవం
వర్షమాసం దినస్యైతత్ తస్యనామ్నః పరస్యవా ।
యదావర్ణం నలుప్తంస్యాత్ తదామృత్యుర్నవిద్యతే
వర్ష ద్వాదశ పర్యంతం కాలంజ్ఞేయం శివోదితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** తాను గాని, ఇతరుడు గాని, 12 సంవత్సరముల వరకు జీవించి యుందుమా? లేదా? రాబోవు 12 సంవత్సరములలో మరణము ఖాయమైనచో ఏ సంవత్సరము మరణించెదము? అని తెలుసుకొనుటకు ఈ క్రింది ప్రయోగము ఉపయోగపడును.

ముందు ఈ క్రింది మంత్రము రోజూ 1008 సార్లు ఏడు రోజులు జపించాలి.

**"ఓం ధత్త కాలపురుషోత్తమ సంధా విశ్వమూర్తే కాలక్షయం అనంతకాలం ప్రదర్శయ ప్రధాన కాలం దర్శయ స్వాహా ॥**

పిమ్మట గోరోచనం – కంకుమపువ్వు – లాక్షా అనామికా వేలి రక్తము మిశ్రమం చేసి వ్రాయుటకు సిద్ధంచేయాలి. పిమ్మట భూర్జపత్రముపై పై మిశ్రమంతో 12 దళముల పద్మం లిఖించాలి.

దాని బయట మరొక 12 దళముల పద్మం లిఖించాలి. దానికి బయట 16 దళముల పద్మం లిఖించాలి.

ఈ చక్రం మధ్యలో మూలమంత్రం వ్రాయలి. మొదటి 12 దళములందూ 1 - 2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 ఇలా 12 సంఖ్యలు లిఖించాలి. దాని బయట 12 దళములందూ 12 నెలలపేర్లు వ్రాయలి. దానికి బయట 16 దళములందు రోజులు 15 రోజులు, 16లో వ్యక్తిపేరులో మొదటి అక్షరం లిఖించాలి. కర్ణిక యందు వ్యక్తి పేరు లిఖించాలి.

ఈ చక్రమును, చక్రవిధానంలో అర్చించాలి. పూజ పూర్తయిన పిమ్మట చక్రాన్ని చూడాలి. దినదళములలో సాధ్యవ్యక్తి పేరులోని మొదటి అక్షరము కనబడకపోయినచో ఆ వ్యక్తి జీవించడు. అక్షరము కనబడుతున్నచో ఆ వ్యక్తి 12 సంవత్సరములు తప్పక జీవించును, మరణించడు. ఈ విధముగా భవిష్యత్తు తెలియును.

శ్లో॥ మార్గశీర్షేతు కృష్ణాయాం పంచమ్యాం నీరజం శుభం।
భూర్జపత్రం సమానీయ లాక్షాకుంకుమరోచనైః ।
స్వకీయానామికార్కైః లిఖేత్ విద్యాం శివోదితామ్
క్రమ పూజాం విధాయాసౌ పశ్చాద్ విద్యాం సమర్చయేత్ ।
శరావపుటమధ్యస్థాం జాతీపుష్పైః సువేష్టితాం
శుభపీఠే విధృత్యాథ తాం విద్యాం పూజయేన్నిశి ।
ప్రాతః కృత్వార్చనం భూయః కృత్వాపూజ్యా కుమారికా



సాధకస్త్వేక చిత్తేన పశ్చాత్ విద్యాం విలోకయేత్ ।
వర్ణాధిక్యే భవేద్రాజ్యం మాత్రాధిక్యే చ సంపదః ।
సమత్వేసుఖమారోగ్యం హానిర్బిందు విలోపనాత్ ।
మాత్రాహీనే భవేద్వ్యాధిర్మరణం బిందునాశనే ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మార్గశిరమాసంలో బహుళ పంచమినాడు, ఒక అందమైన భూర్జపత్రం గ్రహించాలి. దానిపై లాక్షా - గోరోచనం కుంకుమపువ్వు - అనామికారక్తం మిశ్రమంతో - ఈ క్రింది మంత్రం లిఖించాలి.

**ఓం హ్రీం హ్రీం మ్లేం మహాపతయే రక్ష రక్ష మృతామృతోద్భవే మ్లేం హ్రాం హ్రీం విచ్చే స్వాహా ॥**

పిమ్మట దానికి పంచోపచార పూజ చేసి, ఒక మట్టి మూకుడు నందు భూర్జపత్రమునుంచి జాజిపూలతో నాలుగువైపులా అలంకరించి దానిని పీఠస్థానమునందుంచి రాత్రియందు కూడా పూజ చేయాలి.

ఉదయమున మరల పూజ, కుమారీ అర్చన చేయాలి. భూర్జ పత్రముపై వ్రాసిన మంత్రాక్షరములు పరిశీలించాలి. అందు అధికముగా మరొక అక్షరము కనిపించిన రాజయోగము కలుగును. మాత్ర అధికముగానున్న సంపత్ లాభము,

అక్షరములు పాడవకుండా అదేవిధముగా ఉండినచో సుఖము - ఆరోగ్యము కలుగును. బిందులోపము వలన హాని, మాత్రా హీనమైనచో రోగము, బిందునాశనం వల్ల మృత్యుభయం కలుగును.

# మృత్యుజ్ఞానము

శ్లో॥ శుద్ధనిర్మల మాదిత్య వివరం యది పశ్యతి
తద్ వర్షాంతే క్షయం యాతి నాన్యథా భైరవోదితమ్।
సితంకృష్ణం హరిద్రాభం సమూలం భానుమండలం
యః పశ్యతి సదాఽసౌవై వర్షాదర్థం న జీవతి ।
రవిబింబే జలేదృష్టే సంపూర్ణే న మృతిః క్వచిత్
ఖండే దిక్షుః క్రమాత్ మృత్యు రేక ద్విత్రిషు మాసతః
మధ్యచ్ఛిద్రే దశాహేన తజ్జలే ధూమ సంకులే
సచ్ఛిద్రో దృశ్యతేచంద్రః తద్వత్ వాదర్పణే రవిః ।
దృశ్యతే నిష్ప్రభోవాపి యస్యాసౌమ్రియతేఽబ్దతః
యస్యవా స్నానమాత్రేణ హృదయం యది శుష్యతి ।
ధూమోవాదర్పనేయస్య సప్తమాసాంత జీవనమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** నిర్మలమైన సూర్యబింబము నందు రంధ్రము కనబడినచో అతడు ఒక సంవత్సరములో మరణించును. అదేవిధముగా సూర్యబింబము ఒక్కోసారి నల్లగా, తెల్లగా, పచ్చగా కనబడినచో ఆవ్యక్తి ఆరునెలలు మాత్రమే జీవించును.

సూర్యబింబమును నీటిలో చూచినపుడు, ప్రతిబింబము పూర్తిగా గోచరించినచో అతనికి మరణకాలము కాదు. కాని నాలుగు ప్రక్కలా ఖండితముగా కనబడినచో, ఎన్ని ఖండభాగములు



కనబడునో అన్ని నెలలు మాత్రమే జీవించును. అదే ప్రతిబింబము నందు మధ్యలో రంధ్రము గోచరించినచో, బూడిదరంగు కనబడిననూ అతడు పదిరోజులలో మరణించును.

దర్పణమునందు సూర్యుడు, లేదా చంద్రుడు రంధ్రముతో కనిపించిననూ, సూర్యుడు తేజోహీనముగా కనబడిననూ అతడు ఒక సంవత్సరములో మరణించును.

స్నానము చేసినపుడు వెంటనే హృదయస్థానము పొడిగా ఆరిపోయినచో, నేత్రములకు పొగలాగా కనిపించిన అతడు ఏడు నెలలు జీవించును.

శ్లో॥ కృష్ణరక్తాని వస్త్రాణి రక్తమాల్యా నులేపనం
స్వప్నేవాలభతేఽకస్మాత్ షణ్మాసాంతే న జీవతి ।
భక్తిః శీలం స్మృతిశ్చైవ బుద్ధిర్బలమహైతుకం
యస్యైతాని నివర్తంతే షణ్మాసాంతే న జీవతి ।
రాక్షసైః భూతభేతాళైః శ్వానశూకర గర్దభైః
గృధ్రైః కాకైరులూకైశ్చ మహిషైర్వాక్రమేళకైః ।
స్వప్నే వేష్టిత మాత్మానం పశ్యేదబ్దాన్న జీవతి
ఆస్యోరస్కాం యదాపశ్యే దాత్మచ్ఛాయా మథాపివా।
సుకృష్ణాస్తారకాః పశ్యేత్ షణ్మాసాంతే న జీవతి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** స్వప్నమునందు నల్లని, ఎర్రని వస్త్రములు, రక్తవర్ణమూలమాలలు, రక్తలేపనం అయినట్లు

దర్శించిన 6 నెలలు జీవించును. భక్తి – శీలము – జ్ఞాపకాలు – బుద్ధి – బలము, కారణము లేకుండా నశించినచో 6 మాసముల కంటె ఎక్కువ జీవించడు.

అదేవిధముగా రాక్షస – భూత భేతాళ – కుక్కలు – పందులు – గాడిదలు – గ్రద్దలు – కాకులు – గుడ్లగూబలు – గేదెలు – ఒంటెలు తనను చుట్టుముట్టినట్లు దర్శించిన ఒక సంవత్సర కాలము జీవించును. తన నీడ వక్షః స్థలమువరకే కనిపించిననూ, ఆకాశ మందు నక్షత్రములు నల్లగా కనబడిననూ 6 మాసములు జీవించును.

శ్లో॥ శంఖావర్తే భ్రువోర్మధ్యే గుల్ఫయోర్మర్మసంధిషు
స్యందనం యస్యనైవాస్తి మాసాదూర్ధ్వం న జీవతి ।
చక్షుషీస్రవతోనిత్యం న శృణోత్యపి నిశ్చితం
దీపగంధం న జానాతి పక్షాదూర్ధ్వం న జీవితి ।
యధావిష్ణు స్తథా రుద్రః ఏవమావర్తయేత్ క్రమాత్ ।
బ్రహ్మకాలే నాభిపద్మే విష్ణుకాలే హృదంబుజే
కంఠంతే రుద్రకాలేతు ధ్యాత్వా కాలస్యవంచనమ్ ॥
కాలసంకర్షణీం విద్యాం జ్యోతీరూపాం జపేత్తతః ।
కాలోవిముఖతాం యాతి లక్షజాపే కృతే సతి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం** :- లలాటమునందు రెండు భ్రుకుటములమధ్య గుల్ఫములమధ్య ముడిచినపుడు మడత పడకపోయిననూ, మర్మసంధులందు చమట పట్టకపోయిననూ 1 నెలకంటె ఎక్కువ జీవించడు.



కళ్ళనుండి నిత్యమూ నీళ్లు కారుతూ, చెవులు వినబడకుండా ఉన్నప్పుడు – నూనెదీపము ఆరినపుడు వత్తివాసన తెలియక పోయిననూ పదిహేను రోజులకంటె ఎక్కువ జీవించడు.

పుట్టిన నాటినుండి మానవుని 11 సంవతర్సరముల వరకు బ్రహ్మ రక్షించును. ఆపై 22 వరకు విష్ణువు రక్షించును. ఆపై 33 వరకు రుద్రుడు రక్షించును. ఇది మరల మరల ఆవృత్తమగు చుండును.

బ్రహ్మకాలమునందు నాభియందునూ, విష్ణుకాలమునందు హృదయమునందునూ, రుద్రకాలమందు కంఠమునందునూ ధ్యానము చేయుట వలన కాలమును జయింపవచ్చును. అనగా అకాల మృత్యువు కలుగదు.

ఈ క్రింది మంత్రము "పశ్చిమామ్నాయము" నందు కలదు. నాభినుండి బ్రహ్మరంధ్ర పర్యంతము తేజోరూపిణి అయిన మాయా బీజము "హ్రీం" సర్పాకారములో నున్నది. దీనిని నిత్యమూ జపించువారు కాలమును జయింతురు.

**"ఓం క్లీం ప్రం క్రాం తౌం తాం క్రాం సమ్మోహిని చండేకాల సంకర్షిణ్యైనమః।** ఈ మంత్రజపము ఒక లక్ష చేసిన సర్వభయములు తొలగును.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే కాలవంచనం నామ త్రయోవింశం పటలమ్ ॥*

❊ ❊ ❊

# చతుర్వింశం పటలమ్

## అజ్ఞాత నిధి గ్రహణము

శ్లో॥ సాధకస్యహితార్థాయ శిఖాబంధో విధీయతే
నిధిగ్రహణ పూర్వంతు సహస్త్రైః సహాయకైః ।
శాబరంధారయేద్రూపం మంత్రీసర్వార్థ సిద్ధయే
చతురస్రం చతుర్ ద్వారం తన్మధ్యేఉష్ట దళాంబుజమ్ ।
కృత్వైతన్మండలం మంత్రీ కుంకుమాగురు చందనైః
తన్మధ్యే స్థాపయేత్ కుంభం జలపూర్ణం మనోరమమ్ ।
నందినం చ శ్రియం పూర్వాద్వారదేశే ప్రపూజయేత్
కీర్తించైవ మహాకాళం దక్షిణే పశ్చిమే పునః ।

..............................................................

ఖన్యమానే నిధౌ సర్పాః నిస్సరంతి భయానకాః
ఔషధేన వినా తేభ్యో భయం స్యాన్మంత్రిణామపి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** నిధిని సాధించబోవు సాధకుల హితార్థము కొరకు ఇది చెప్పబడుచున్నది. తెలియని ప్రదేశములలో నిధిని గ్రహించునపుడు, సహాయకులతో సహా అందరూ రక్షణ కొరకు **"ఓం రక్ష రక్ష విచ్చే స్వాహా"** అను మంత్రముతో శిఖాబంధనము లేదా తలపాగా చుట్టుకోవడం చేయాలి.



అందరూ శబరుల వేషం ధరించాలి. కుంకుమపువ్వు అగరు – చందనములతో చతురస్రము లిఖించి, అందు అష్టదళ పద్మము ఒక చతుష్కోణమండలము లిఖించి కలశస్థాపన చేయాలి.

**"ఓం సోమాయ విశ్వాధిపతయే ఆగచ్ఛ, ఆగచ్ఛ, బలిం గృహాణ మనోవిశ్వే స్వాహా"** అను మంత్రముతో సోముని అష్టమాతృకలను, అర్చించాలి. అష్టమాతృకల మంత్రము

**ఓం నమోబ్రాహ్మ్యైఆగచ్ఛ ఆగచ్ఛ బలింగృహాణ ॥** అనంతరం **"ఓం శక్ర ఆగచ్ఛ, ఆగచ్ఛ బలింగృహాణ"** అని ఇంద్రుని, దిక్పాలురను అర్చించాలి.

చతురస్రము యొక్క తూర్పు ద్వారమునందు నందిశ్రీని, పూజించాలి. దక్షిణమందు మహాకాలుని – కీర్తిని, పడమరయందు గణపతిని – కుమారస్వామిని, ఉత్తరదిశయందు భృంగి – దండిని అర్చించాలి.

నిధి త్రవ్వు సమయమున అఘోర మంత్రమును జపిస్తూ ఉండాలి. కలశమందున్న జలముతో **"ఓం నమో భగవతే అర్భటే పింగళోదరాయ పాపం నాశయ నాశయ, దురాచారం హన హన, అభిషిక్తానాం రక్ష రక్ష, అభిషేక పదం ఉపధారయ ఉపధారయ కురు సమరభిషణే నమో విచ్చే వౌషట్ ॥** అను మంత్రముతో అందరూ అభిషిక్తులు కావాలి.

ఖననసమయమునందు **"ఓం హ్రీం హ్రీం హ్రూం అఘోర తరతర, ప్రస్ఫురప్రస్ఫుర, ప్రకట ప్రకట, ధనేశాయ కహ కహ**

**సమసమ, జాత జాత, దహదహా, పాతయ పాతయ, ఓం ప్రౌం ప్రౌం ప్రాం అఘోరాయ ఫట్** ॥ అను మంత్రము కూడా జపిస్తూండాలి.

అట్టి సమయము కొన్ని భయంకర సర్పములు, బయలు వెడలును. కొన్ని పాదలేపనములు ఔషధమూలికలతో చేసినవి పూసుకొనిన అవి బాధించకుండా ఉండును.

## సర్పభయ నివారణ

శ్లో॥ అర్కస్య కరవీరస్య పనసస్య చ మూలికా
పిష్ట్వా పాదప్రలేపాత్ తు దూరే గచ్ఛంతి పన్నగాః ।
మక్షికా గిరికర్ణీచ శ్వేతార్కం కంటకారికా
వచాచ మూలికాం చైషా పిష్ట్వాపాదంప్రలేపయేత్ ।
అనేనపాదలేపేన విఘ్నాయాంతి దిశో దశ ।

.........................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** జిల్లేడు, గన్నేరు, పనస మూలములు, జలముతో నూరి, పాదలేపనముగా గ్రహించిన, పాములు దూరముగా పోవును. మాక్షికము (ఇది స్వర్ణమాక్షికము – రజిత మాక్షికమని రెండు విధములు. ఇది ఒక పర్వత సంబంధ ఖనిజము) గిరికర్ణి – తెల్లజిల్లేడు – కంటకారి, వచ – వీటి సమముగా గ్రహించి నీటితో నూరి పాదలేపనం చేసుకొనిననూ సర్పములు దరిచేరవు.



గుమ్మడి – ఆముదంచెట్టు – ఉమ్మెత్తల బీజములు – దానిమ్మ మూలం – తాళ మూలం – గోమూత్రముతో నూరి పాదలేపనముగా పూసుకొనిననూ, సర్ప – యక్ష – పిశాచములు నిస్సందేహముగా తొలగిపోవును.

నిధిస్థలమును మంత్రయుక్తముగా 8 కాష్ఠములతో 8 దిశలందూ కీలితము చేయవలయును. ప్లక్ష – మోదుగ – లోధ్ర కదంబ – నిమ్మ – మేడి – రావి – జమ్మి కాష్ఠములు 12 అంగుళములు కలవి గ్రహించి ఎనిమిది దిశలందూ, ఈ క్రింది మంత్రముతో అభిమంత్రించి కీలితము చేయవలయును.

**ఓం పునంతు మాం దేవగణాః పునంతు గణనాయకాః పునంతు విశ్వేదేవాశ్చ జాతవేదాః పునీహిమామ్** ॥

అటు పిమ్మట **"ఓం సర్వభూతాధిపతయే నమః"** అను మంత్రముతో నైవేద్యం సమర్పించి, ఓం హ్రీం ఫట్ మంత్రముతో నిధిస్థలముపై పూలు చల్లాలి. **"ఓం నమో భగవతే కేతుమాలినే గరుడేశుభే ఓం హ్రీం కపాలిని ఉద్ధారయ గృహాణ నిధిం స్వాహా"** అని బయటకు తీయాలి.

## 4 రకముల నిధులు

శ్లో॥ చత్వారో నిధయస్తత్ర శంభుదేవేన కీర్తితాః
కచ్ఛ సోమకరః శంఖః పద్మఇత్యభి ధానతః ।
కచ్ఛపీ మకరశ్చైతో స్థిర చిత్తౌ స్వభావతః

సుఖసాధ్యౌ యథాపూర్వం విధానేన సమాహరేత్ ।
శబ్దేన తు మనుష్యాణాం శంఖపద్మౌ రసాతలం
గచ్ఛంతౌ న తు దృశ్యేతే తత్ర మంత్ర ద్వయం స్మరేత్ ।
శైవం చ వైష్ణవం చైవ తతఃసిద్ధో భవేత్ ధ్రువం

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** నిధులు భూగర్భములో నుండునవి ముఖ్యమైనవి నాలుగు విధములని శ్రీకంఠ శంభునాథ సిద్ధుడు ఉపదేశించెను. (శ్రీకంఠ శంభునాథ సిద్ధుడు "నిధిప్రదీపము" అను గ్రంథము సంస్కృతభాషలో రచించెను. ఇందు నిధులను గూర్చి, అవి ఎక్కడ ఏఏ స్థలములందు లభించునో చాలా వివరముగా వ్రాసినాడు. ఆ పుస్తకము **1930**లో "త్రివేంద్రం సంస్కృత సిరీస్" వారు మూలం ప్రచురించారు. ఇది నాలుగు పరిచ్ఛేదములుగా నున్నది. త్వరలో తెలుగు అనువాదముతో ప్రచురించబడును.)

శివుడు ఆదేశించిన ప్రకారము కచ్ఛప - మకర - శంఖ - పద్మములని, నిధులు నాలుగు రకములుగా నుండును. వీటిలో కచ్ఛప - మకరనిధులు మాత్రమే స్థిరముగా - అచంచలముగా ఒకచోట యుండును. వీటినే ప్రయత్నముచేత, శివానుగ్రహముచేత సాధించగల్గుదురు.

మిగిలిన శంఖ - పద్మనిధులు, మానవుని శబ్దము వినబడి నంతనే, చంచలమై మరొక స్థలమునకు లేదా పాతాళమునకు పోవును. ఇవి సాధించుట అసంభవం. అయితే శివ - విష్ణు మంత్రముల సిద్ధి పొందినవారికి లభించు అవకాశమున్నది.



**శివమంత్రము :** ఓం నమో భగవతే రుద్రాయ నిధిముత్తిష్ఠ మాచలం స్వాహా ॥

**విష్ణు మంత్రము :** ఓం నమో భగవతే వాసుదేవాయ ధరధర బంధ శ్రీ పర్వత కులపర్వతే వసునిధిం సాధయ స్వాహా ॥

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే అజ్ఞాత నిధిగ్రహణ నియయోనామ చతుర్వింశం పటలమ్ ॥*

* * *

# పంచవింశం పటలమ్

## 30 యక్షిణీ సాధనలు

శ్లో॥ సర్వాసాం యక్షిణీనాం తు ధ్యానం కుర్యాత్ సమాహితః ।
భగినీ మాతృపుత్రీస్త్రీ రూపతుల్యా యథేప్సితాః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఇపుడు 30 యక్షిణీ సాధనలు వివరించుచున్నాడు. సమస్త యక్షిణీ సాధనలలో ఏకాగ్ర చిత్తముతో ధ్యానం అవసరము. సాధకుడు తన కోరిక ననుసరించి యక్షిణిని, సోదరి - తల్లి - కుమార్తె - భార్య రూపములలో ఎవరో ఒకరుగా భావించి జపించాలి.

### 1. విచిత్రా సాధన

శ్లో॥ లక్షమేకం జపేన్మంత్రం వటవృక్షతలే శుచిః
బంధూకకుసుమైః పశ్చాత్ మధ్వాజ్యక్షీర మిశ్రితైః ।

దశాంశం యోనికుండేతు హుత్వాదేవీ ప్రసీదతి ।
విచిత్రాసాధకస్యైవ ప్రయచ్ఛతి సమీహితమ్ ।
త్రిపథస్థోభవేన్మంత్రం లక్షమేకం దశాంశతః
ఘృతాక్తైః గుగ్గులైర్హోమైః విచిత్రా సిద్ధిదా భవేత్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పవిత్రముగా, వటవృక్షము క్రింద కూర్చొని **"ఓం విచిత్రే విచిత్రరూపే సిద్ధిం కురు కురు స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించాలి. జపానంతరం యోని ఆకార హోమకుండమునందు తేనె, నెయ్యి, పాలతో బంధూక పుష్పములు తడిపి, దశాంశం హోమం చేయాలి. యక్షిణీ విద్య సిద్ధించి సాధకుని అభీష్టము నెరవేర్చును.

## 2. మహానందీ సాధన

మూడు మార్గముల కూడలియందు కూర్చొని **"ఓం ఐం హ్రీం మహానందే భిషణే హ్రీం హుం స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించాలి. పిమ్మట నేతితో గుగ్గిలహోమం పదివేలు చేయాలి. యక్షిణి సిద్ధించును.

## 3. కనకవతీ సాధన

శ్లో॥ గత్వా యక్షగృహంమంత్రీ న గ్నోభూత్వా జపేన్మనుం
దినైక వింశతిం కుర్యాత్ పూజాంకృత్వా తతోనిశి ।
ఆవర్తయేత్ తతోమంత్రమేక చిత్తేన సాధకః
నిశార్ధే వాంఛితం ద్రవ్యం దేవా గత్యప్రయచ్ఛతి ।



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు యక్షగృహము (?) చేరి, ఏకాంతముగా దిగంబరుడై 21 రోజులు "ఓం హ్రీం నఖకేశి కనకవతి స్వాహా" అను మంత్రమును పూజానంతరం జపం చేయాలి. అర్ధరాత్రియందు యక్షిణి ప్రత్యక్షమై వాంఛితము నెరవేర్చును.

## 4. కువలయా సాధన

శ్లో॥ లక్షత్రయం జపేన్మంత్రం దశాంశం గుగ్గులుంహునేత్
లాక్షా ఉత్పలకం వాథ ధ్యాత్వా సర్వాంగ లోచనామ్।
పట్ట్ పటే వా సంలిఖ్య హోమాంతే వాంఛితప్రదా

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :- ఓం కువలయే హిలిహిలి, తు తు తు సిద్ధిసిద్ధేశ్వరి హ్రీం స్వాహా"** అను మంత్రమును మూడు లక్షలు జపించి దశాంశం గుగ్గిల హోమం ఆచరించాలి. యక్షిణీ చిత్రమును ఒక పటముపై లిఖించి ధ్యానించాలి. హోమానంతరం యక్షిణి సిద్ధించును.

## 5. విభ్రమా సాధన

శ్లో॥ జపేల్లక్షద్వయం మంత్రీ శ్మశానే నిర్భయోమనుం
దేవతాం పూజయేన్నిత్యం జపేల్లక్షం త్రయోదశమ్ ।
పాయసంహోమయేత్ పశ్చాత్ సహస్రైకౌణసిధ్యతి
నిత్యంలోక సహస్రస్య భోజనం సాప్రయచ్ఛతి ।
లక్షయుర్దివ్య వర్షాణి దత్తే సా శంకరోదితా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పచ్చికూరలు - పాలు - పిండి మాత్రమే ఆహారముగా తీసుకొనుచు సాధకుడు తెల్లని కంబళిపై కూర్చోని **"ఓం హ్రీం జలపాణి పిజ్జల పిజ్జల హుం బ్లూం స్వాహా"** అను మంత్రమును 13 లక్షలు జపించాలి. అనంతరం వెయ్యిసార్లు పాయసహోమం చేయాలి. యక్షిణీ అను గ్రహముచే సాధకుడు నిత్యమూ 1000 మందికి భోజనము పెట్టగల సమర్ధత పొందును. దివ్యజీవనము పొందును.

## 7. సులోచనా సాధన

శ్లో॥ లక్షముత్పల శాఖోత్థం హుత్వామంత్ర మిమంజపేత్
లక్షైక దశమావర్త్య హుత్వామధ్యే శశిగ్రహే ।
అథవా మాలతీ పుష్పైః హుత్వాభాను సహస్రకమ్
గ్రహముక్తిర్భవేత్ యావత్ పూర్ణాంతే సిధ్యతి ధృవం।
సహస్రం తు జపాద్యంతే సహస్రాణాంతు భోజనమ్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు చంద్రగ్రహణ సమయమునందు ముందుగా **"ఓం భూతే సులోచనే బ్లూం"** అను మంత్రముతో పద్మబీజములను ఒక లక్ష హోమం చేయాలి. పిమ్మట ఇదే మంత్రమును 12 లక్షలు జపించి మరల హోమం చేయాలి. లేదా సూర్యగ్రహణ సమయమునందు 12 వేలు జాజిపూలు హోమం చేసి వెయ్యి జపం చేయాలి.

సాధకుడు వెయ్యిమందికి భోజనం పెట్టగల సమర్ధత పొందును.



## 8. రతిప్రియా సాధన

శ్లో॥ శంఖలిప్తే పటేదేవీం గౌరవర్ణాం ఘృతోత్పలాం
సర్వాలంకరిణీం దివ్యాం సమాలిఖ్యాఽర్చయేత్ పునః
జాతీపుష్పైః సోపచారైః సహస్రైకంతతో జపేత్
త్రిసంధ్యం సప్తరాత్రయ తతో రాత్రౌ శుచిర్జపేత్ ।
అర్ధరాత్రే గతే దేవీ సమాగత్య ప్రియచ్ఛతి ।
పంచవింశతి దీనారాన్ ప్రత్యహం సాప్రయచ్ఛతి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** శంఖచూర్ణం లేపనము చేసిన పటమునందు, తెల్లని శరీరముతో, పద్మపాణి, సర్వాలంకార భూషిత అయిన రతిప్రియను చిత్రించి, రాత్రియందు పవిత్రముగా జాజిపూలతో పూజించి **"ఓం హ్రీం రతిప్రియే స్వాహా"** అను మంత్రమును వెయ్యిసార్లు జపించాలి.

ఈ విధముగా 7 రోజులు చేసినచో, మంత్రము సిద్ధించి సాధకుడు 25 దీనారములు ప్రతిదినము పొందగల సమర్ధుడగును. (దీనార శబ్దము పర్షియా దేశమందలి నాణెము పేరు క్రీ॥శ 4 - 5 శతాబ్దులలో భారతదేశమందు కూడా చలామణీలో ఉండేది).

## 9. పిశాచికా సాధన

శ్లో॥ ఏకవింశ దినం యావ దుదయాస్తమయే జపేత్
నిత్యం సాయం స్వమాహార పిండం హర్మ్యే పరిక్షిపేత్
త్రిసప్తాహేతు సాతుష్టా శయ్యాం గత్వా పిశాచికా

పంచవింశతిదీనారాన్ దదాతి ప్రతివాసరం ।
కర్ణేకథయతి క్షిప్రం యద్యత్ పృచ్ఛత్యసాక్రమాత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** 21 రోజులు సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకు **"ఓం హ్రీం చః చః కంబళకే గృహ్ణ పిండం పిశాచికే స్వాహా"** అను మంత్రము జపించాలి. సంధ్యాకాలమందు సాధకుడు తాను భుజించు ఆహారమును, ఒక పిండముగా చేసి మేడపై నైవేద్యంగా ఉంచాలి.

మంత్రము సిద్ధించినచో పిశాచికా యక్షిణి, సాధకుని శయ్యపై ప్రకటమగును. నిత్యము 25 దీనారముల నిచ్చును. (?) సాధకుని ప్రశ్నలకు అతని చెవియందు సమాధానము వినిపించును. (ఇది కర్ణపిశాచినీ విద్యవలె యున్నది. ఇంతకంటే వివరములు లభించలేదు.)

## 10. చంద్రగిరా సాధన

శ్లో॥ గృహే వారణ్యా ఏకాంతే లక్షమేకం జపేన్మనుం
పుష్పధూపాదిభిః పూజాం నిత్యం కుర్యాత్ ప్రయత్నతః
పంచామృతై ర్దశాంశేన హుతేదేవీ ప్రసీదతి
దీనారాణాం సహస్రైకం ప్రత్యహంతోషితా సతి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఏకాంతముగా గృహము నందుగాని, అరణ్యము నందు గాని **"ఓం గులుగులు చంద్రామృతమయి అవజాతి లుం హులు హులు చంద్రగిరే స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించాలి.



పిమ్మట పంచామృతములతో దశాంశం హోమం చేయాలి. సిద్ధి పొందిన సాధకునకు నిత్యమూ వెయ్యి దీనారముల ననుగ్రహించును.

## 11. సురసుందరీ సాధన

శ్లో॥ ఏకలింగం మహాదేవం త్రిసంధ్యం పూజయేత్సదా
ధూపందత్వా జపేన్మంత్రీ బ్రూహి సా త్వం కిమిచ్ఛసి।
దేవి దారిద్ర్యదగ్ధోఽస్మి తన్మే నాశకరీ భవ
తతోదదాతి సాతుష్టా విత్తాయు శ్చిరజీవితమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు ప్రతి దినము మూడు సంధ్యలయందు, ఏకలింగ శివుని పూజించాలి. (5 క్రోశుల వరకూ చుట్టుప్రక్కల ఎక్కడా శివలింగము లేని ప్రాంతమును ఏకలింగ శివాలయం అంటారు. ఏకలింగమున్నచోట అది తప్ప చుట్టూ 8 కిలోమీటర్ల దూరంలో మరో శివాలయం ఉండరాదు.) పూజానంతరం **"ఓం హ్రీం ఆగచ్ఛ సురసుందరీ స్వాహా"** అను మంత్రమును జపించాలి. సిద్ధి పొందినచో ధనము – ఆయువు కలుగును. (జప సంఖ్య చెప్పబడలేదు. ఇటువంటి సందర్భములో 8 వేలు జపం చేయాలని ఇతర తంత్రశాస్త్ర గ్రంథములందు చెప్పబడినది)

## 12. మైథున ప్రియసాధన

శ్లో॥ కుంకుమేన సమాలిఖ్య భోర్జపత్రే సులక్షణాం
ప్రతిపత్తిథి మారభ్య పూజాంకృత్వా జపేత్తతః ।

త్రిసంధ్యంత్రి సహస్రంతు మాసాంతే పూజయేన్నిశి
సంజపేన్నార్ధరాత్రేతు సమాగత్య ప్రయచ్ఛతి ।
దీనారాణాం సహస్రైకం ప్రత్యహంపరితోషితా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** భూర్జపత్రమునందు కుంకుమతో సర్వసుందరముగా మైథునప్రియ చిత్రము లిఖించి పాడ్యమి నుండి ఒక నెల పర్యంతము మూడు సంధ్యలయందూ పూజ చేయుచూ – **"ఓం హ్రీం అను రాగిణి మైథున ప్రియే స్వాహా"** అను మంత్రమును రోజుకు **3000** జపించాలి. అర్ధరాత్రియందు సిద్ధించును. వెయ్యి దీనారముల నను గ్రహించును.

## 13. మనోహరా సాధన

శ్లో॥ నదీతీరే శుభేదేశే చందనేన సుమండలం
విధాయ పూజ యేద్దేవీం తతో మంత్రాయుతం జపేత్
త్రిసప్తాహం జపేదేవం ప్రసన్నే విరతస్తదా
దీనారాణాం సహస్రైకం వ్యయం కుర్యాద్దినేదినే ।
వినావ్యయేన సాక్రుద్ధా నదదాతి కదాచన ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** నదీతీరమందు, శుభ్రమైన స్థలమున కూర్చొని, చందనముతో మండలమేర్పరచి అందు మనోహరాదేవి నారాధించి – **"ఓం హ్రీం సర్వకామదే మనోహరే స్వాహా"** అను మంత్రమును పదివేలు జపించాలి. ఇలా **21** రోజులాచరించాలి.



సిద్ధి పొందిన సాధకునకు వెయ్యి దీనారములనను గ్రహించును. ఏ రోజువచ్చినది ఆ రోజే వ్యయం చేయాలనేది ఇందులో నియమం !

## 14. శంఖినీ సాధన

శ్లో॥ మంత్రాయుతం జపేన్మంత్రీ ప్రాతఃసూర్యోదయేసతి
మాసమేకం జపేదేవం పూజాం కుర్యాద్దినేదినే ।
శంఖసంలిప్త పట్టేతు శుభ్రపుష్పైః సపాయసైః
దశాంశం హోమయేత్ సాజ్యైః ఇంధనైః కరవీరజైః ।
దదాతిశంఖినీ తుష్టా నిత్యం రూప్యక పంచకమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు ప్రతీ దినమూ సూర్యోదయమునుండి "ఓం హ్రీం శంఖచారిణి శంఖాభరణే హ్రీం హ్రీం క్లీం ఐం ఆం స్వాహా" అను మంత్రమును పదివేలు జపించాలి. శంఖపట్టముపై లిఖించిన శంఖినీ దేవిని పూజించాలి.పిలా ఒక నెల ఆచరించాలి. తెల్లని పూలతో పూజించి, పాయసం నివేదన చేయాలి.

చివరిరోజున దశాంశ హోమము గన్నేరు సమిధలతో చేయాలి. శంఖిని అనుగ్రహమువలన నిత్యమూ అయిదు వెండి నాణెములు పొందగలడు.

## 15. మణిభద్రా సాధన

శ్లో॥ సహస్రాష్ట మిమం మంత్రం జపేత్ సప్తదినావధి
ప్రత్యహం మణి భద్రాఖ్యం ప్రయచ్ఛత్యే కరూప్యకమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** వారంరోజులు ప్రతి దినమూ "ఓం నమో మణిభద్రాయ నమః పూర్ణాయ నమో మహాయక్ష సేనాధిపతయే, మోట మోట ధరాహస్వాహా" అను మంత్రమును **8000** జపించాలి. సిద్ధి పొందినచో నిత్యమూ ఒక వెండినాణెము పొందును.

## 16. త్యాగీ సాధన

శ్లో॥ చతుర్లక్షమిమం మంత్రం జపేత్త్యాగీ ప్రసీదతి ।
దదాతి చింతితా నర్థాంస్తస్య భోగాయ మంత్రిణః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు **"ఓం అహోత్యాగి మమ త్యాగార్థం దేహి మే విత్తం వీరసేవితం స్వాహా"** అను మంత్రమును నాలుగు లక్షలు జపించాలి.

## 17. సాగర చేటక సాధన

శ్లో॥ రాత్రౌ రాత్రౌ జపేన్మంత్రం సాగరస్య తట్ శుచిః ।
లక్షజాపే కృతో సిద్ధో దత్తే సాగర చేటకః ॥
రత్నత్రయం మహామూల్యం తేనమంత్రీ సుఖీ భవేత్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు సముద్ర తీరమునందు రాత్రివేళ, శుచిర్భూతుడై **"ఓం నమో భగవన్ రుద్ర దేహి రత్నాని జలరాశే నమోஉస్తుతే స్వాహా"** అను మంత్రమును లక్ష జపం చేయాలి. సాగరచేటక అని యక్షుడు ప్రసన్నుడై రత్న త్రయమును అనుగ్రహించును.



(ఇది చేటక మంత్రము. శివునకు 64 మంది చేటకులనే యక్ష సేవకులు కలరు. వీరికి ప్రత్యేక మంత్ర - తంత్ర విధానము లున్నవి. - మేడవరపు సంపత్ కుమార్)

## 18. స్వామీశ్వరీ సాధన

శ్లో॥ ఏకాంతే చ శుచౌదేశే త్రిసంధ్యం త్రిసహస్రకం
మాసమేకం జపేన్మంత్రీ తతః పూజాం సమారభేత్ ।
పుష్పధూపాదినైవేద్యైః ప్రదీపైః ఘృతపూరితైః
రాత్రావభ్యర్చయేత్ సమ్యక్ సుస్థిరః సుమనాసుధీః ।
అర్ధరాత్రే గతేదేవి సమాగత్యప్రయచ్ఛతి
రసం రసాయనం దివ్యం వస్త్రాలంకారభూషణమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు **"ఓం హ్రీం మహాభయే హుంఫట్ స్వాహా"** అను మంత్రమును మూడు సంధ్యలయందు, ఏకాంతముగా, శుచిగా పంచోపచార పూజ చేసి మూడువేలు జపించాలి. ఇలా ఒక మాసం ఆచరించాలి. సాధకునకు రససిద్ధి కలుగును.

## 19. వటయక్షిణీ సాధన

శ్లో॥ త్రిపథస్థో వటాధస్థో రాత్రౌమంత్రం జపేత్ సదా
లక్షత్రయం తతః సిద్ధాస్యాత్‌దేవీ వటయక్షిణీ ।
వస్త్రాలంకరణం దివ్యం సిద్ధం రస రసాయనం
దివ్యాంజనం చ సాతుష్టా సాధకాయ ప్రయచ్ఛతి ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మూడు మార్గముల కూడలి యందు గాని, మర్రిచెట్టు క్రింద గాని, రాత్రియందు **"ఓం హ్రీం వటవాసిని యక్షకుల ప్రసూతే వట యక్షిణి ఏహ్యేహి స్వాహా"** అను మంత్రమును మూడు లక్షలు జపించాలి. సిద్ధి పొందిన సాధకుడు దివ్య రసాయన - అంజనములు పొందగలడు.

## 20. చంద్రయోగినీ సాధన

శ్లో॥ వటవృక్షం సమారుహ్య లక్షమేకం జపేన్మనుం
తతః సప్తాభి మంత్రేణ కాంజికైః క్షాలయేన్ముఖమ్ ।
యామద్వయం జపేద్ రాత్రౌ వరం యచ్ఛతి యక్షిణీ
రసంరసాయనం దివ్యం శుద్ధకర్మాణ్యనేకధా ।
సిద్ధాని సర్వకార్యాణి నాన్యధా శంకరోదితమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు రాత్రియందు వటవృక్షము నధిరోహించి "ఓం నమో భగవతే రుద్రాయ చంద్ర యోగిని స్వాహా" అను మంత్రమును ఒకలక్ష జపించి, అదే మంత్ర ముతో గంజితో లేదా బియ్యం కడుగుతో ఏడుసార్లు ముఖం ప్రక్షాళన చేసుకోవాలి. సిద్ధిపొందిన సాధకుడు యక్షిణివలన దివ్య రస - రసాయనములను, ఇష్టసిద్ధిని పొందును.

## 21. విశాలా సాధన

శ్లో॥ చించావృక్షతలే మంత్రం లక్షామావర్తయేత్ శుచిః
విశాలా వితరేత్ తుష్టా రసం దివ్యం రసాయనమ్ ॥



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు చించావృక్షము ( ) క్రింద పవిత్రముగా - **"ఓం హ్రీం విశాలేద్రాం ద్రం క్లీం ఏహ్యేహి స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించిన సిద్ధించును. దివ్య - రస - రసాయనములు పొందును.

## 22. మహాభయా సాధన

శ్లో॥ నరాస్థి నిర్మితాంమాలాం గలేపాణౌ చ కర్ణయోః ।
ధారయేజ్జ పమాలాంచ తాదృశీంతు శ్మశానతః ॥
లక్షమేకం జపేన్మంత్రం సాధయే న్నిర్భయః సుధీః
తతోమహాభయాసిద్ధా దదాత్యేవ రసాయనమ్ ।
తేన భక్షిత మాత్రేణ పర్వతానపి చాలయేత్
వలీపలితనిర్ముక్త శ్చిరజీవీ భవేన్నరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు శ్మశానమందు రెండు చేతులకు, రెండు చెవులకు నరుని వెన్నెముకచే చేసిన మాల ధరించి, అటువంటి మాలతో నిర్భయుడై **"ఓం హ్రీం మహాభయే హుం ఫట్ స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించవలయును.

యక్షిణీ అనుగ్రహముచే దివ్యరసాయనము పొందును. అది భక్షించిన, వృద్ధాప్యము లేకుండా చిరకాలము జీవించును.

## 23. చంద్రికా సాధన

శ్లో॥ శుక్లపక్షేజపేత్ తావత్ యావద్ దృశ్యేత చంద్రికా
దత్తే పీత్వా యదమరోఽమృతం తచ్ఛభవేన్నరః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు శుక్లపక్ష రాత్రియందు చంద్రదర్శనమగుచున్నంత కాలము "ఓం హ్రీం చంద్రికే హంసః స్వాహా" అను మంత్రమును, జపించుచూ ఉండవలయును. యక్షిణి అనుగ్రహము వలన దివ్యరసాయనముతో చిరజీవనము పొందును.

## 24. పాతాళ సిద్ధిదా సాధన

శ్లో॥ శక్రచాపోదయే లక్షం నిర్గుండీ తలమధ్యగః
జపేన్మంత్రం తతస్తుష్టా దేవీ పాతాళసిద్ధిదా ।
హృదిధ్యాత్వా జపేద్ రాత్రౌ హంసబద్ధః సచేతకః
యోగం దదాతి సా తుష్టా జరామృత్యు వినాశనమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు, ఆకాశమునందు ఇంద్రధనస్సు కనబడినపుడు, ఆ సమయమున "నిర్గుండీ" వృక్షము క్రింద కూర్చొని **"ఓం ఐం క్లీం ఐంద్రి మాహేంద్రి కులుకులు, చులు చులు, హంసః స్వాహా"** అను మంత్రమును ఒక లక్ష జపించాలి. మరియొక ప్రయోగమిట్లున్నది.

రాత్రియందు సాధకుడు హంసాసనములో కూర్చొని ఏకాగ్రచిత్తముతో **- ఓం హం సః సర్వలోచనాని బంధయ బంధయ, దేవీ ఆజ్ఞాపయతి స్వాహా"** అని జపించవలయును (ఎనిమిదివేలు) జ్ఞానసిద్ధి కలుగును.



## 25. చేతికా సాధన

శ్లో॥ స్వీయమూర్ధ్ని కరం దత్వా లక్షం జపేన్మనుం ।
వాక్సిద్ధిం మంత్రిణే దేవీ చేతికావై ప్రయచ్ఛతి ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు తన ఎడమ చేయిని తన శిరస్సుపై నుంచి **"ఓం నమో లింగోద్భవ రుద్ర దేహి మే వాచః సిద్ధిం వనానాం పర్వతగతే ద్రాం ద్రీం ద్రం ద్రైం ద్రౌం ద్రః** । అను మంత్రమును ఒక లక్ష జపించిన వాక్సిద్ధి పొందును.

## 26. రక్తకంబలా సాధన

శ్లో॥ జపేన్మాసత్రయం రక్త కంబళే సుప్రసీదతి ।
మృతకోత్థాపనం కుర్యాత్ ప్రతిమాచలనం తథా ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు మూడు నెలలు ఎర్రని కంబళిపై కూర్చొని, **"ఓం రక్తకంబళ మహాదేవి ద్రుత మము కాముక యుత్థాపయ ఉత్థాపయ, ప్రతిమాంచాలయ చాలయ పర్వతం కంపయ కంపయ లీలయా చిలి చిలి, హుం హుం"** అను మంత్రమును జపించాలి. సిద్ధిపొందిన సాధకుడు నిర్జీవమైన ప్రతిమను చలింపచేయగలడు.

## 27. విద్యుత్ జిహ్వా సాధన

శ్లో॥ అష్టోత్తర శతం జప్త్వా యత్ కించిత్ స్వాత్మ భోజనం
తత్రైవ వాసవం దత్తే నిత్యం సాన్నిధ్య కారకమ్ ।

అతీతానాగతం కర్మ స్వాస్థ్యా స్వాస్థ్యం బ్రవీతి సా
ప్రతిమాపర్వతాన్ సర్వాన్ చాయత్యేవ తత్క్షణాత్ ॥

.......................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు నిత్యము భోజనమునకు ముందు **"ఓం కరం కముఖే విద్యుజ్జిహ్వే ఓం హుం చేటకే జః జః స్వాహా"** అని 108 సార్లు జపించి, తాను తినబోవు దానిని అర్పించాలి. కొంత కాలమునకు జ్ఞానసిద్ధి – ఆరోగ్యసిద్ధి కలుగును.

ఇందుకు ముందుగా **"ఓం హ్రీం సః నమః శ్మశానవాసిని చండవేగిని స్వాహా"** అను మంత్రమును పదివేలు జపించి, పసుపు – నేయితో వెయ్యిసార్లు హోమం చేసి, మరల పదివేలు జపించాలి.

పిమ్మట రాత్రియందు దేహమునకు ఎర్రచందనము పూసుకొని నిద్రించు వరకు జపం చేయాలి. స్వప్నమందు సిద్ధి – అసిద్ధి గూర్చి యక్షిణి వివరించును.

## 28. చంద్రస్రావిణీ సాధన

శ్లో॥ కరంజ వృక్ష మారుహ్యా జపేద్ దశ సహస్రకం
తత్ పంచాంగ కల్కేన ఆపాదం సం విలేపయేత్ ।
జపాంతే పూర్వవత్ స్వప్నే కథయేత్ సా శుభాశుభమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు గానుగ వృక్ష మధిరోహించి **"ఓం నమశ్చంద్ర స్రావిణి కర్ణాకర్ణకారిణి స్వాహా"**



అను మంత్రమును పదివేలు జపించాలి. పిమ్మట అదే చెట్టు పంచాంగములతో కల్కము చేసి దానితో ఆపాదమస్తకము లేపనము చేసుకొని, మంత్రజపము చేయుచూ నిద్రించాలి. స్వప్నమునందు సాధకునకు యక్షిణి సమస్త విషయములూ వివరించును.

## 29. చాముండా సాధన

శ్లో॥ పూర్వ మేవాయుతం జప్త్వా కుష్ఠ కల్కాభిమంత్రితం
సప్త వారం ప్రలేపేన స్వప్నే వక్తి శుభాశుభమ్ ।
త్రైలోక్యే యాదృశీవార్తా తాదృశీ కథయత్యలమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు **"ఓం హ్రీం ఆగచ్ఛ చాముండే స్వాహా"** అను మంత్రమును పదివేలు జపించాలి. పిమ్మట కుష్ఠపంచాగముతో కల్కముచేసి, దానిని ఏడుసార్లు అభిమంత్రించి శరీరమునకు రాసుకొని నిద్రించవలయును. యక్షిణి స్వప్నమునందు సాధకుని ఇచ్ఛానుసారము సమస్త వార్తలను తెలియచేయును.

## 30. కర్ణపిశాచినీ సాధన

శ్లో॥ అలాబు మూలికా పుష్యే తథా సర్పాక్షి మూలికా
సంగ్రాహ్యే మంత్రితా యత్నాత్ రక్త సూత్రేణవేష్టయేత్ ।
మంత్రేణమూర్ధ్ని బద్ధంతు వదత్యేవ శుభాశుభమ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సాధకుడు పుష్యమీ నక్షత్రము రోజున అలాబూ మూలిక, సర్పాక్షి మూలిక గ్రహించి **"ఓం నమో భగవతే రుద్రాయ కర్ణపిశాచిని స్వాహా"** అను

మంత్రముతో అభిమంత్రించి దానిని ఎర్రని దారముతో బంధించి దానిని శిరస్సుపై ధరించిన సమస్త శుభాశుభముల జ్ఞానము యక్షిణి తెలియజేయును. (ఈ విద్య ఇచట అసంపూర్ణముగా నున్నట్లు తోచుచున్నది.)

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే యక్షిణీ సాధనం నామ పంచవింశం పటలమ్ ॥*

❋ ❋ ❋

## షడ్వింశం పటలమ్

## అథ వ్యాధి జననమ్

శ్లో॥ బిల్వవృక్షోద్భవైః కాష్టైః కరండం కారయేద్ బుధః ।
పిచుమర్దోద్భవైః కాష్టైః పిధానం కారయేద్బుధః ॥
తత్రమధ్యే క్షిపేన్మూర్తి ముత్తానాం జీవితా న్వితామ్
వర్తిముచ్ఛిష్ఠ సిక్తాంవా శత్రోస్తస్యోదరే క్షిపేత్ ।
కీలయేత్ కంటకేనైవ వా శత్రోస్తస్యోదరే క్షిపేత్ ।
కీలయేత్ కంటకేనైవ నిఖనేత్ సంపుటీ క్షిపేత్
వ్యాధిస్తస్యభవేత్ శత్రోః పునస్తత్క్షాలనాత్ సుఖీ

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం:-** శత్రువునకు వ్యాధి కలిగించు ప్రయోగములు చెప్పుచున్నాడు. మారేడు చెక్కతో ఒక పీఠం చేయాలి. దానిని నిమ్మచెక్కతో ఆచ్ఛాదనం చేయాలి. దానిమధ్య శత్రువు బొమ్మ



చేసి దానికి ప్రాణప్రతిష్ఠ కావించి దానిని రెండు చెక్కల మధ్య ఉంచి, శత్రునక్షత్రమునకు వృక్షమునకు సంబంధించిన కాష్ఠము తెచ్చి, ఆ బొమ్మ ఉదరములో ఉంచాలి. దానిపై దీపం వెలిగించాలి.

పిమ్మట ప్రతిమను ముల్లుతో గ్రుచ్చి, మొత్త సంపుటమునంతా దీపసహితముగా భూమిలో పాతిపెట్టాలి. శత్రువు ఈ ప్రయోగము వలన వ్యాధిగ్రస్తుదవుతాడు. దీనిని త్రవ్వి బయటకు తీసిన ఆరోగ్యవంతు దగును.

ఈ ప్రయోగమునకు ఈ క్రింది మంత్రమును అభిమంత్రించి ఆచరించాలి.

**ఓం నమో భగవతే ఉడ్డామరేశ్వరాయ భూవాహవే ఉన్మనే స్వాహా"**

శ్లో॥ త్ర్యంగుళమ నూరాధాయా మంకులీ మూలమాహరేత్
చక్షూరోగకరం గేహే నిఖనేత్ వైరిణాం ధృవమ్ ॥

**అనూరాధా నక్షత్రమునందు మూడంగుళముల అంకోల మూలము "ఓం అంధే రహః అంధే రహః స్వాహా" అను మంత్రముతో తెచ్చి శతృగృహమునందు పాతినచో, అతనికి నేత్ర రోగము కలుగును.**

బహుళాష్టమి రోజున భృంగరాజమూలము తెచ్చి, శతృ శిరమున (చూర్ణము) వేసిన, జ్వరము అతిసారము కలుగును.

## పొలములో ఉపద్రవ శాంతి

శ్లో॥ వాలుకాం శ్వేత సిద్ధార్థాన్ ప్రక్షిపేత్ క్షేత్రమధ్యతః ।
శలభాః సరసాః కీటాః వరాహాః మృగమూషికాః ॥
శశకాస్త్రత్రనాయాంతి మంత్ర విద్యాప్రభావతః ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పొలములో మిడుతలు - కీటకములు - పురుగులు - ఎలుకలు - కుందేళ్లు - పందులు మొదలగు వాటి వలన బాధలు, పంట నష్టం లేకుండా ఉండటానికి, ఈ క్రింది మంత్రముతో తెల్లావాలు కలిపిన ఇసుకను అభిమంత్రించి పొలమంతా వెదజల్లాలి.

**ఓం నమః సురేహో బలజః పరి పరి శిలి స్వాహా ।**

మరికొన్ని ప్రయోగములు బల్లి - సర్పం - గుడ్లగూబ మాంసములతో చెప్పబడినవి.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే వ్యాధిజననం నామ షడ్ వింశం పటలమ్ ॥*

* * *

# సప్తవింశం పటలమ్

## ఆశ్చర్యగుటికా

శ్లో॥ స్నుక్ క్షీరం కానకంబీజం చూర్ణం భావ్యం చ కాంచనైః
వస్త్రేణ వేష్టితం చైవ క్షురస్యేవ తు రంహసా ॥



ఛిద్యతే కేశసంఘాతం సవస్త్రమతికౌతుకమ్
ఏరండస్యచ బీజాని నింబతైలం తథైవ చ
వర్తి సర్వరసోపేతాం తైలలిప్తాం జలే క్షిపేత్ ।
జ్వలితాదీపవత్ తిష్ఠేత్ యావద్ వర్తి ర్నసంశయః ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఆముదము గింజలు - నిమ్మతైలము వీటితో వత్తిని తడిపి ఆరనిచ్చి మరల తడుపవలయును. దానిని నూనెతో తడిని నీటిలో వేసి వెలిగించిన దీపముగా వెలుగును.

బ్రహ్మచెముడు పాలు, నల్ల ఉమ్మెత్తగింజలు, కలిపి నూరి దానిని దేవకాంచనముతో భావనచేసి దానిని ఒక వస్త్రమునకు పట్టించి దానిని శిరస్సుపై కట్టి తలరుద్దినచో, వెంట్రుకలన్నియూ ఊడిపోవును.

## చీకట్లో పుస్తక పఠనం

శ్లో॥ ఉలూకస్యకపాలేన ఘృతే నా హృత కజ్జలం
తేన నేత్రాంజనే చిత్రం రాత్రౌ పఠతి పుస్తకమ్ ।
ఉలూకహృదయం పిత్తం కాకపిత్తం చ శోణితం
ఏతద్ వర్త్యాంజితే రాత్రే విచరేత్ వివసే యధా ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఉలూకం (గుడ్లగూబ) యొక్క కపాలమునందు, నేతితో కాటుక తయారుచేసి, దానిని రాత్రియందు కనులకు పెట్టుకొనిన చీకట్లో కూడా పుస్తకం చదవగలడు.

ఉలూకం యొక్క హృదయము, పిత్తము, కాకియొక్క పిత్తము, రక్తము – కలిపి వత్తిచేసి వెలిగించి దీనితో కాటుక తయారు చేయాలి. దీనిని ధరించిన చీకట్లో కూడా అన్ని వస్తువులూ కనబడును.

## తాళంకప్ప బ్రద్దలు....

శ్లో॥ శిఖిపారవతభవా ఖంజరీట పురీషజా
గుటికాస్పర్శమాత్రేన తాళయంత్రం ఖినత్యలమ్ ।

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** నెమలి – పావురం – ఖంజరీట పక్షి (కాటుక పిట్ట) ఈ మూడింటి మలముతో ఒక గుటిక చేయాలి. అది తాళం కప్ప రంధ్రములో వేసినచో తాళం విడిపోవును.

## దశశిరో దర్శనం

శ్లో॥ కటుతుంబ్యుత్థతైలేన పారావత భవం మలం
సమ్యక్వై పేషితంతేన గర్దభస్యాస్థి చైవ వహి ।
లలాటేతిలకంతేన కృత్వాసౌ దృశ్యతే జనైః
దశాస్యో నాత్ర సందేహో యధాలంకేశ్వరో నృపః ।
సింధూరంగంధకం తాళం సమం పిష్ట్వా మనః శిలాం
తల్లిప్తవస్త్ర చ్ఛన్నాంగో రాత్రౌ సందృశ్యతేఽగ్నివత్ ।
ధాత్రికాబీజపిష్టేన లిప్తం కృత్వా ప్రయత్నతః
బహుకాల ప్రదీపంతు దీపోజ్వలతి కౌతుకమ్ ।



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** కటుతుంబి (చేదుదోస) గింజల తైలము, పావురం మలం, గాడిద ఎముక సమానముగా గ్రహించి చూర్ణం చేయాలి. దీనిని తిలకముగా ధరించిన చూచువారలకు పది తలలతో గోచరించును.

## రేడియం వస్త్రం

సింధూరం – గంధకం – హరితాళం – మనశ్శిల సమాన భాగములుగా విడివిడిగా నూరి, కలిపి – దానిని ఒక వస్త్రమునకు లేపనం చేయాలి. దానిని ధరించిన (కప్పుకొనిన) చీకట్లో అగ్నివలె ప్రకాశించును. (పైన చెప్పిన వస్తువులు ఒకేసారి అన్నీ కలిపి నూరరాదు. పేలుడు సంభవించును)

ఉసిరిగింజలు నూరి, వత్తికి దానిని పట్టించి దీపంవలె వెలిగించినచో చాలా సమయము ఆ వత్తి వెలుగును.

ఇంద్రజాలము వలె గోచరించు ఈ పనులన్నిటికీ ఈ క్రింది మంత్రమును పదివేలు జపించాలి.

**ఓం నమో భగవతే రుద్రాయ ఉడ్డామరేశ్వరాయ బహు రూపాయ నానారూప ధరాయ సహ సహ, ససనృత్య, నానా కౌతు కేంద్ర జాల దర్శనాయ హుం ఫట్ ఠః ఠః స్వాహా"**

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే కౌతుకం నామ
సప్తవింశం పటలమ్ ॥

* * *

# అష్టావింశం పటలమ్

## అథ స్తంభనమ్

శ్లో॥ గమనోత్థాన వాగ్బాణ ఖడ్గాది శస్త్రకేషు చ ।
శత్రుసైన్యాశనీనాం చ స్తంభనం శంభునోదితమ్ ॥
రజన్యా హరితాళైర్వా భూర్జపత్రే సమాలిఖేత్
యంత్ర హరిత సూత్రేణ వేష్టయిత్వా తతః పునః ।
శిలాయాం బంధయేత్తచ్చ గతిస్తంభకరం పరమ్ ॥
హరిద్రాకారితం పద్మం తాళపత్రే సుపూజితం
చత్వరే సాధ్యమంత్రాంకం ముఖస్తంభకరం రిపోః ।
యస్యాభిధానముచ్చార్య సప్తాహం జపత్యతేరిపోః ।
మనోవచో గతిస్తంభం చేటకో కురుతే ధృవమ్ ।
హరిద్రయాక్షిపేద్యంత్రం భూర్జపత్రే సమాహితః
వేష్టయేత్ పీతసూత్రైశ్చ పీతపుష్పైశ్చ పూజయేత్ ।
స్థాపయేత్ శిలయోర్మధ్యేవాక్ స్తంభో జాయతేధృవమ్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** గమనము - లేవడం - మాట్లాడటం - ఈ క్రియలు జరుగకుండా చేయగలగడమే "స్తంభనం" అంటారు. ఖడ్గముచేత కొట్టిననూ తెగకపోవుట ఖడ్గ స్తంభనం అంటారు. మేకులపై కొందరు పడుకుంటారు అయినా వారికి ఏమీ గ్రుచ్చుకోవు, రక్తంరాదు ఇది కూడా స్తంభనమే.



## గతి స్తంభన

భూర్జపత్రముపై పసుపు లేదా హరితాళముతో స్తంభన యంత్రము లిఖించి, దానికి పసుపురంగు దారము చుట్టి ఒక పొట్లం వలె చేసి దానిని సాధ్యవ్యక్తి ఎదుట పడవేసిన అతని గమనము ఆగిపోవును.

## ముఖస్తంభన

తాళపత్రముపై పసుపుతో ఒక కమలము లిఖించి, దానిపై శత్రునామము వ్రాయలి. పిమ్మట **"ఓం సహచర వద (అముకస్య) ముఖం స్తంభయస్వాహా"** అను మంత్రముతో పూజించి రహదారి భూమిలో పాతిన శత్రుముఖ స్తంభనమగును.

## వాక్ స్తంభన

దీనినే "నోరుకట్టు" అంటారు. భూర్జపత్రముపై పసుపుతో స్తంభన యంత్రము లిఖించి పసుపు దారముతో చుట్టి దానిని పసుపు పూలతో పూజించాలి. పిమ్మట ఏడురోజులు ఈ మంత్రం జపించాలి. **"ఓం నమో హండనే (అముకస్య) ముఖం వాచం గతిం స్తంభయ, జ్వాలాగర్ధభాగ్ని ముల్కాధికం బంధ బంధ, స్తంభయస్తంభయ, కురు కురు, మమే ప్సితాని ఠ ఠః హుంఫట్ స్వాహా"** పిమ్మట దానిని రెండు శిలల మధ్య పాతిపెట్టాలి. శత్రువుయొక్క మనోవాక్ కాయ ములు స్తంభించును.

## బాణస్తంభన

శ్లో॥ శ్వేత గుంజీయమూలంతు ఋక్షే చోత్తరభాద్రకే
ఉత్తరాభిముఖంగ్రాహ్యం బాణస్తంభకరం ముఖే ।
అంగులీ లక్ష్మణా పుంసీ సర్పాక్షీ శిఖిమూలికా
విష్ణుక్రాంతా జటానీలా పాఠా శ్వేతాపరాజితా ।
పాటలీ సహదేవీ చ మూలం చ సహదేవికా
పుష్కార్కే తు సముద్ధృత్య ముఖే శిరసి సంస్థితా
ఏకైకం వారయత్యేవ శస్త్ర సంధారణో నృణాం
వహ్న్యాఖు వ్యాఘ్రభూపాల చౌరశత్రుభయం త్యజేత్॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** ఉత్తరాభాద్ర నక్షత్రం రోజున తెల్లగురివింద మూలము ఉత్తరముఖముగా వెళ్లునది గ్రహించి, నోటియందుంచుకొనిన బాణ స్తంభనమగును.

## అగ్ని - చోర - రాజాది శత్రుభయ నివారణ

అంకొలఫలము - లక్ష్మణ 1 - కంటకారి 2 - సర్పాక్షి - మయూరశిఖి - విష్ణుక్రాంతా - జటామాంసి - నీలి - పాఠ - తెల్లవిష్ణుక్రాంత పాటలి - సహదేవి (పసుపు -తెలుపు) మూలములు, పుష్కార్కము నందు గ్రహించి (గుటిక చేసి) శిరసునందు లేదా నోటియందు ధరించిన అగ్ని - మూషక - వ్యాఘ్ర - అధికార - చోర - శత్రుభయము కలుగదు.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే శత్రుస్తంభనం నామఅష్టావింశం పటలమ్ ॥

* * *



# ఊనత్రింశం పటలమ్

## అఘోర మంత్ర సాధన

శ్లో॥ పూజాపూర్వఘోరస్య పంచలక్ష మిదం జపేత్
బ్రహ్మచారీ జితక్రోధః పశుసంబంధ వర్జితః ।
కులాచార రతో ధీరః సదాచార సుదీక్షితః
దినాంతే నక్త భుక్ శుద్ధో భూమిశాయీ జితేంద్రియః
అంజలీంస్తర్పయేత్ సప్త జపేత్ రుద్రాక్షమాలయా
పంచలక్షే కృతే జాపే హోమం కుర్యాత్ దశాంశతః॥
శివశక్తి సముద్ భూతం షట్కోణం మేఖలాన్వితమ్
హస్తమాత్ర ప్రమాణేన ఖానయేత్ కుండముత్తమమ్
ఘృతాక్తం హవిరాదాయ మృగముఖ్యాఖ్యముద్రయ
భైరవాస్యే మహా రౌద్రే జుహుయాన్మంత్ర సిద్ధయే ।
ప్రస్ఫుటా పశ్చిమామ్నాయే పంచప్రణవ సంయుతా
పూజనాత్ జపనాత్ హోమాత్ సర్వసిద్ధి మవాప్నుయాత్

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** మహిమాన్వితమైన అఘోర మంత్రసాధన వివరింపబడుచున్నది. అఘోర మంత్రము అయిదు లక్షలు జపం చేసి, దశాంశ హోమం చేసిన సిద్ధించును.

జపకాలమునందు నియమ నిష్ఠలు పాటించవలెను. బ్రహ్మచర్యము - సదాచారము - సత్వగుణము కలిగియుండుట - రాత్రి

యందు భోజనము - నేలపై పరుండుట. వ్యర్థ సంభాషణము చేయకుండుట ఇత్యాది నియమములు పాటించాలి.

ముందుగా ఏడు దోసిళ్ల నీటిని తర్పణము చేసి శివుని అఘోర రూపునిగా ధ్యానించి, రుద్రాక్షమాలతో అఘోర మంత్రము అయిదు లక్షలు జపించాలి.

### శివధ్యానం

**మహాస్యమహికర్ణం చ చంద్ర సూర్యాగ్నిలోచనం।**
**సదంష్ట్రం తం మహాజిహ్వ మూర్ధ్వవక్త్రం విచింతయేత్ ॥**

పిమ్మట శివశక్తి సముద్భూతమైన షట్ కోణ హోమకుండమును హస్తప్రమాణ మాత్రము కలది. మేఖలాన్వితమైన ఉత్తమమైన దానిని నిర్మించి మృగముద్రలు ప్రదర్శించి, నేయి - సమిధలతో **50,000** హోమం చేయాలి

ఈ విద్య పశ్చిమామ్నాయములోనిది. ఈ విధముగా పూజా - జప - హోమాదులు ఆచరించిన అఘోరమంత్రము సిద్ధించును. ఈ సిద్ధికి మంచిన సిద్ధి మరి లేదు. ఇదే గాక బ్రహ్మాస్త్ర - పావకాస్త్ర - శక్తి అస్త్ర - చంద్రహాస (ఖడ్గం) - వరుణాస్త్ర వజ్రప్రాప్తి సాధనలు చెప్పబడినవి.

ఈ సాధనలన్నీ ముందు అఘోరమంత్రము సిద్ధించిన తరువాతనే ప్రయత్నించాలి.

*ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే అస్త్రసాధనం నామ ఊనత్రింశం పటలమ్ ॥*

* * *



# త్రింశం పటలమ్

## సర్వసిద్ధికర యోగం

శ్లో॥ భాగాః షోడశ చాజ్యస్య సహదేవ్యా స్త్రి పంచకాః
త్రయోదశ శిలాభాగాః పుత్రజీవీ ద్విభాగికా ।
హస్తపేటారికా సప్త భాగా గౌరాశ్చతుర్దశ
ఏకాదశంతు దంత్యాస్తు వంధ్యాకర్కోటికాష్టచ ।
దశభాగా రుద్రజటా విష్ణుక్రాంతా తదర్ధి కా
శ్వేతార్కస్య చతుర్భాతా లజ్జాచ నవభాగికా ।
షడ్ భాగా లక్షణా జ్ఞేయా ద్విషట్కా మేష శృంగికా
చాండాలీ భాగ ఏకః స్యాత్ త్రిభాగా చేంద్రవారుణీ।
ఏతత్ షోడశకం యోగం సర్వసిద్ధికరం నృణామ్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** సర్వసిద్ధికర యోగము వివరింపబడుచున్నది. ఆవు నేయి **16** భాగములు, సహదేవి **15** భాగములు, శిలాజిత్తు **13** భాగములు, పుత్రజీవి **2** భాగములు - హస్తాపేటారికా (?) మూలము **7** భాగములు, తెల్ల ఆవాలు **14** భాగములు, దంతి **11** భాగములు, వంధ్యా కర్కోటకి మూలం **8** భాగములు.

రుద్రజట **10** భాగములు, అపరాజితామూలం **5** భాగములు, తెల్లజిల్లేడు, లజ్జావతి మూలం **9** భాగములు, లక్ష్మణ మూలము **6**

భాగములు మేషశృంగి 12 భాగములు, చాండాలీ మూలము 1 భాగము ఇవన్నీ సేకరించాలి.

## యోగస్థాపన పద్ధతి

శ్లో॥ ప్రతియోగం చతుష్కోష్ఠే చతుస్త్రింశం తు భాగికాః
గ్రాహయే దుక్తయోగేన యధాయత్ర తధోచితమ్
ఏతేషాం పరిభాషా తు జ్ఞప్తి హేతోర్నిగద్యతే
భూర్జపత్రే పటే వాథ చతురస్రం సమాలిఖేత్ ॥
హాం హీం హూం హాశ్చతుర్దిక్షు ఏకైకం బీజమాలిఖేత్
హాం హీం హూం హాశ్చతుర్దిక్షు ఏకైకం బీజమాలిఖేత్
మాత్రాష్టకం లిఖేత్ దిక్షు మమరక్షతు సంయుగే ॥

.....................................................................

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** చెప్పబోవు ప్రతియోగము యొక్క సంకేతము గ్రహించి, చతుష్కోష్ఠమందు 34 భాగములు గ్రహించాలి. భూర్జపత్రముపై గాని, వస్త్రముపై గాని, ఒక చతురస్ర మును కుంకుమ – గోరోచనములతో 16 గడులతో లిఖించాలి. మండలము యొక్క నాలుగు కోణములందు హాం, హీం, హూం, హః అని వ్రాయలి.

మరల మండలమునకు తూర్పుదిశనుండి ఈశాన్య దిశవరకు 8 స్థలములందు, "ఓం – హుం – ఫట్ – మమ – రక్షతు – సంయుగే – హుం ఫట్" అను ఎనిమిది పదములు లిఖించాలి.



దీనికి బయట ఎనిమిది దిశలందు "ఆం క్రోం" మంత్రము చుట్టూ లిఖించాలి రేఖాగ్రమందు వజ్రం లిఖించాలి. పిమ్మట "ఓం హ్రీం రక్త చాముండే తురు తురు, సర్వసిద్ధింకురుకురు, స్వాహా" అను మంత్రము పఠించుచూ, ప్రతీ కోష్ఠమునందు ఈశాన్యాది క్రమముగా రెండేసి ఓషధులు ఒక్కొక్క గడిలో నిక్షిప్తం చేయాలి.

## జగద్వశకరయోగము

శ్లో॥ పూర్వమే వాయుతం జప్త్వా సర్వసిద్ధికరో భవేత్
కళాగుణస్మరైః ద్వాభ్యా మంగలేపే జగద్వశమ్ ।
దిగష్ట సప్తనవభి పాణౌ లేపే కృతే సతి
యోద్ధా విజయ మాప్నోతి యధా .................. ।
మనుస్మర త్రిభిర్వేదైః కృత్వాతు గుటికాంకరే
బాహౌశిరసి కర్ణే చ ధృత్వా చోరై ర్నబాధ్యతే ।
వేద దింగ్ మునికామైశ్చ వక్త్రస్థైర్నాక్రమేత్ విషం
స్మరార్క్రేషు గుణైర్యుక్తం తిలకం శత్రుజిత్ భవేత్ ॥

**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పూర్వమందు చెప్పబడిన మంత్రమును ముందుగా పదివేలు జపించి సిద్ధి పొందాలి. పిమ్మట 16 – 3 – 13 భాగములుగా చెప్పబడిన ఓషధులు లేపనముగా శరీరమునకు పూసుకొనినచో, జగత్ వశ్యమగును. 10 – 8 – 7 – 9 భాగములుగా చెప్పబడిన ఓషధులు అరచేతికి లేపనము చేసుకొని యుద్ధమునకు వెళ్ళినచో విజయము ప్రాప్తించును.

**14 – 13 – 3 – 4** భాగములుగా చెప్పబడిన ఓషధులు కలిపి నూరి గుటికగా చేసి చేతికి ధరించిన చోర బాధ కలుగదు. **14 – 10 – 7 – 13** భాగములుగా చెప్పబడిన ఓషధులు, గుటికగా చేసి నోటియందుంచుకొనిన విషము హరించును.

అదే విధముగా **13 – 12 – 5 – 3** భాగములుగా చెప్పబడిన ఓషధులు, నూరి తిలకముగా ధరించిన కార్యసిద్ధి కలుగును.

శ్లో॥ సప్తషణ్ణవ పక్షాస్తు పుష్యార్కే మూల సంయుతాః
దత్తం ధూపం న రస్త్రీణాం సర్వలోకవశంకరమ్ ।
యుగేందుముని పక్షాంకైః పేషయిత్వా రవేర్దినే
పుష్యార్కేలేపయేత్ స్వాంగం సర్వత్రవిజయీ భవేత్
స్పర్శమాత్రేణ సందేహః శత్రువాదే భయంకరః
గుణషడ్ నగదిగ్భిస్తు యుక్తం పంచమలై స్సహ ।
దశాంశం ధూపలేపోయం ధనధాన్యకరోగృహే
తిధి పక్షయుతైః కామైర్దినై ర్దినచతుష్టయమ్ ।
నరతైలేన తద్వర్తిర్దివా పశ్యతి భూనిధిమ్
కలా గుణయుగైరుద్రైః శతధా చాజ్యపీడితైః ।
కర్షమాత్రం సదాభోజ్యే దద్యాన్న పవితం వ్రజేత్
వజ్రకాయో భవేత్ వర్షాత్ జీవేత్ బ్రహ్మదినం త్రయమ్ ।



**సంపత్కరీ తెలుగు వ్యాఖ్యానం :-** పుష్యార్కయోగమున **7 – 6 – 9 – 15** భాగములుగా చెప్పబడిన ఓషధులు గ్రహించి, వాటిని నూరి ఆ చూర్ణమును ధూపము వేసినచో సర్వవశమగును.

**4 – 1 – 7 – 15** భాగములుగా చెప్పబడిన ఓషధులు ఆది వారమునాడు నూరి, పుష్యార్కయోగమున శరీరమునకు లేపనము చేసుకొనినచో కార్యసిద్ధి కలుగును. వ్యతిరేకముగా మాట్లాడు వ్యక్తిని స్పృశించినచో అతడు అనుకూలుడగును.

## ధనధాన్యకర యోగము

**3 – 6 – 9 – 10** భాగములుగా చెప్పబడిన ఓషధులు, తనయొక్క పంచమలములతో (మూత్రము – విష్ఠా – నేత్ర – కర్ణ – నాసికా మలములు) కలిపి దశాంశము గృహమునందు ధూపము వేసిన గృహమునందు ధనధాన్యవృద్ధి జరుగును.

## భూగర్భ నిధి దర్శనం

**15 – 2 – 13 – 7** భాగములుగా చెప్పబడిన ఓషధులు గ్రహించి, వాటిని నూరి ఒక వత్తికి లేపనము చేసి, దానిని 4 రోజులు నరతైలము (కొబ్బరినూనె? –) నందుంచి, 5వ దినమున వెలిగించిన భూగర్భమందున్న నిధి పరిలక్షితమగును.

# వజ్రదేహ సిద్ధి

16 - 3 - 4 - 11 భాగములుగా చెప్పబడిన ఓషధులు గ్రహించి వందసార్లు నేతితో మర్దించి, ఒక తులము భోజనముతో నిత్యమూ సేవించినచో వార్ధక్యము రాదు, జుట్టు తెల్లబడుట, రాలి పోవుట జరుగవు. ఇలా ఒక సంవత్సరకాలము భుజింపవలయును, శరీరము దృఢముగా నుండి ఎక్కువ కాలము జీవించును.

ఇతి శ్రీ సిద్ధనాగార్జున విరచితే కక్షపుటే సర్వసిద్ధికర
యోగోనామత్రింశం పటలమ్ ॥

❊ ❊ ❊

# సర్వసిద్ధికర యోగస్థాపన, చక్ర నిర్మాణవిధి






# అనుబంధం

## 18వ పటలంలోని గుటికాసాధన

**సంస్కృత గద్యము:-** సాధకః చిల్వాలయం గత్వా నిత్యం తస్మై నివేదయేత్, దేవతా బుధ్యాఽతిభక్త్యా భక్షణార్థం కించిత్, కించి దామ మాంసం నిక్షిపేత్ । యావత్ రపసూతా భవతి । తతః పారద రసం సార్ధ నిష్కత్రయం కస్మించిత నాళికాద్వయే నిక్షిపేత్ ।

తస్యాథోర్ధ్వం ఛిద్రంసిక్థేన రుధ్వా చిల్వాలయం గత్వా అండద్వయస్యోపరి నాలికా ద్వయం నిధాయ లౌహశలాకయా నాలికా మధ్యమార్గేణ తదండంలఘు హస్తేన వేధయిత్వా శలాకా - ముద్ధరేత్ । తేనైవ మార్గేణ అండమధ్యే యథాశ్మో గచ్ఛతి తథాయత్తం కుర్యాత్

తతశ్ఛిద్రం చిల్వష్ఠయా లిపేత్ । తత స్తద్ వృక్షాథో నిత్యమతి బల్యుపహారేణ పూజాం కుర్యాత్ । యావత్ స్వయమేవాండాని స్ఫోట యంతి తావన్నిత్యముపరి గత్వా వీక్షయేత్ । స్ఫుటితే సతి గుటికా ద్వయం గ్రాహ్యమ్ ।

తతో వృక్షాదుత్తీర్య యో గిలతి మనుష్య స్తస్మై ఏకాదేయా । అపరాం స్వయంముఖే ధారయేత్ । యోజన ద్వాదశం గత్వా పునరేవ నివర్తయేత్ । ఇతి సిద్ధయోగః ।

ఓం హ్రీం హ్రూం ఫట్ చిల్వా చక్రేశ్వరి పరాత్ పరేశ్వరి
పాదుకాసాధనం ఓం దేహి మే దేహి స్వాహా ॥

అనేన మంత్రేణ జపం పూజాం చ కుర్యాత్

* * *

## ఆకాశగమనం

**ఓం హ్రీం చిత్రలేఖే ఆగచ్ఛ ఆగచ్ఛ తు తు తు తు హ్రీం స్వాహా।**

శ్లో॥ లక్షత్రయం జపేన్మంత్రీ ధ్యాత్వాతాం రక్తవర్ణకాం
కదంబవనమధ్యేతు మదఘూర్ణిత లోచనామ్ ।
కుండలైర్మణి భిర్దివ్యైః వస్త్రాలంకారభూషితాం
సామృతం కలశం వామే దక్షిణే మణిహారకామ్ ।
దధతీం చింతయే ద్దీప్తాం రక్తపద్మోపరిస్థితామ్ ।
ప్రహసంతీం చిత్రలేఖా ప్రసన్నాం నవయౌవనాం
ఈదృశీం పూజ యేన్నిత్యం జపాంతే హోమయేత్తతః ।
శర్కరా భాగమాంసంతు గోక్షీరం ఘృత సంయుతం
దశాంశేన తతస్తుష్టా గోచరత్వం ప్రయచ్ఛతి ॥
విమానంఖేచర త్వంచ దదాత్యమృత భోజనం
ఆయుర్లక్షా యుతం చైవ హారకేయూర మండలమ్ ।
నానాలోక గతించైవ యస్మాన్మంత్రీ సుఖీ భవేత్ ॥

* * *

| | |
|---|---|
| పంచాంగ విజ్ఞాన సర్వస్వం | 30-00 |
| ఖచ్చితలగ్న సాధన (లగ్న పట్టికలు) | 72-00 |
| ముహూర్త విజ్ఞాన సర్వస్వము | 72-00 |
| జాతకఫల నారాయణీయం | 72-00 |
| హస్తరేఖలు అవగాహన | 9-00 |
| చమత్కార చింతామణి | 20-00 |
| పూర్వకాలామృతం | 36-00 |
| ఉత్తర కాలామృతం | 36-00 |
| నేమాని సంఖ్యాశాస్త్రం | 24-00 |
| నేమాని నవరత్నాలు అద్భుత ఫలితాలు | 24-00 |
| జ్యోతిష ఫలగ్రంథం | 12-00 |
| జాతకచక్రం వేయు విధానం | 15-00 |
| జ్యోతిషం చెప్పడం ఎలా? | 15-00 |
| జ్యోతిష ఫలరత్నాకరము | 24-00 |
| సులభ ప్రశ్నశాస్త్రము | 12-00 |
| నవగ్రహ దశాఫల చంద్రిక | 24-00 |
| మీరూ హస్తసాముద్రికము నేర్చుకోండి | 150-00 |
| శ్రీరామచంద్ర హస్తరేఖాశాస్త్రము | 75-00 |
| సంపూర్ణ హస్తరేఖాశాస్త్రము (100 బొమ్మలతో) | 24-00 |
| హస్తరేఖా శాస్త్రం | 12-00 |
| నేమాని పుట్టుమచ్చలు - ఫలితాలు | 15-00 |
| నేమాని కలలు - ఫలితాలు | 15-00 |
| జ్యోతిష ఫల ప్రకాశిక | 24-00 |
| నిత్యజీవితంలో నవరత్నధారణ | 30-00 |
| ప్రారంభ జ్యోతిషం | 21-00 |
| జగచ్చంద్రిక ప్రశ్నాశాస్త్రము, పంచపక్షిశాస్త్రము | 44-00 |
| జాతక రెమెడీస్ | 45-00 |
| నిత్యజీవితములో అదృష్టసంఖ్యాశాస్త్రము | 72-00 |
| ద్వాదశరాశులు, లగ్నాలు, భావాలు | 72-00 |
| జననకాల ఫలదర్శిని | 30-00 |
| ప్రయాణ ఫలమంజరి | 30-00 |
| శకున శాస్త్రఫలమంజరి | 30-00 |



| | |
|---|---|
| నక్షత్రనాడీ ఫలదర్శిని | 45-00 |
| గోచార ఫలదర్శిని | 150-00 |
| మీ సంపూర్ణ జాతకచక్రం మీరే వేసుకోండి | 30-00 |
| బృహజ్జాతకాది పద్ధతులు | 150-00 |
| శ్రీదశమహావిద్యలు | 395-00 |
| శ్రీ భైరవ తంత్రము | 390-00 |
| శ్రీగురు ఆరాధన | 150-00 |
| అనుభవ మంత్రయంత్రతంత్రశిరోమణి | 75-00 |
| అనుభవ మంత్రయంత్ర చింతామణి | 45-00 |
| అనుభవ మంత్రయంత్ర శాస్త్రం | 15-00 |
| వామాచారం & కాళీ కర్పూరతంత్రం | 36-00 |
| యక్షిణీతంత్ర రహస్యం&ఉడ్డీశతంత్రం | 36-00 |
| తంత్రవాహిని & తంత్రమంజరి | 36-00 |
| శ్రీలక్ష్మీతంత్రం&కాక చండీశ్వరతంత్రం | 36-00 |
| కామరత్న తంత్రం&హేవజ్ర తంత్రము | 35-00 |
| అలబ్ధ తంత్ర గ్రంథము | 35-00 |
| మేరుతంత్ర సంగ్రహము | 35-00 |
| తంత్రశాస్త్ర గ్రంథావళి (8 తంత్రాలు) | 80-00 |
| ఆకాశ భైరవతంత్రం | 45-00 |
| కౌళాచారం, నీలసరస్వతీతంత్రం, కామాఖ్యాతంత్రం | 36-00 |
| అధర్వవేద, మహానిర్వాణ, రసతంత్రం | 75-00 |
| తర్కశాస్త్ర నిఘంటువు | 30-00 |
| బృహన్నీలతంత్రం | 150-00 |
| మహా మంత్ర యంత్ర తంత్ర అద్భుతరహస్యాలు | 100-00 |
| వస్తుగుణ ప్రకాశిక(వీటూరి వాసుదేవశాస్త్రి) | 600-00 |
| లోలంబరాజీయము (ఆయుర్వేదం) | 75-00 |
| అమృతాహారం | 35-00 |
| ఆయుర్వేద చిట్కాలు | 18-00 |
| సంపూర్ణ ఆరోగ్యానికి ఆయుర్వేదం | 21-00 |
| హోమియో గృహవైద్యం | 80-00 |
| సకల మూలికా చికిత్స | 18-00 |
| సకల వస్తుగుణ దీపిక | 48-00 |